# నేనే ప్రశ్న - నేనే సమాధానం



జ్ఞానాంబయే

అడిగేవాడుగా - చెప్పేవాడుగా

తన లీలను ప్రదర్శించింది

శ్రీరమణ సత్సంగంలో.

ఆ లీలా వైభవమే ఈ పుస్తకం...

ఓం సద్గురువే నమః

# నేనే ప్రశ్న - నేనే సమాధానం

**Devotee : What is GOD?**

**Bhagavan : What is, is GOD.**


**శ్రీసద్గురు సుబ్రహ్మణ్యం**

**శ్రీరమణ సత్సంగం**

L.I.C. కాలనీ, వాటర్ ట్యాంక్,

శ్రీకాళహస్తి-517 644, చిత్తూరు జిల్లా, ఆం.ప్ర.

సెల్ : **99494 91773**

**నేనే ప్రశ్న - నేనే సమాధానం**

శ్రీరమణ సత్సంగం
శ్రీకాళహస్తి.

ప్రతులు : 1000

ముద్రణ : శ్రీ షిరిడీసాయి బాబా మహాసమాధి చెంది
వందేళ్లయిన సందర్భంగా
15-10-1918 * 15-10-2018

**Price : Your Love and Support.**

ప్రచురణకర్త : శ్రీరమణ సత్సంగం,
శ్రీకాళహస్తి.

ముఖచిత్రం : జ్ఞానప్రసూనాంబిక
శ్రీకాళహస్తి

డి.టి.పి. :
**శ్రీవారిగ్రాఫిక్స్, తిరుపతి,**
సెల్ నెం. 99 484 34277

# అంకితం



**శరణాగతియే నిజమైన నమస్కారం**

**అని ప్రబోధించిన మహాజ్ఞాని**

**శ్రీసాయినాథుని దివ్యపాదారవిందములకు...**

**- శ్రీరమణ సత్సంగం**

**శ్రీకాళహస్తి**

నేనే మార్గం - నేనే గమ్యం.

నేనే చలనం - నిశ్చలం.

నేనే పాపం - నేనే పుణ్యం.

నేనే నరకం - నేనే స్వర్గం.

నేనే బంధం - నేనే మోక్షం.

నేనే 'నేను' - నేనే 'నాది'

నేనే అహమిక - నేనే 'అహం'.

నేనే అనేకం - నేనే ఏకం.

నేనే ఉన్నట్లున్నది - నేనే ఉన్నది.

నేనే మాయ - నేనే బ్రహ్మం.

నేనే అసత్యం- నేనే సత్యం.

నేనే పార్వతి - నేనే శివుడు.

నేనే ప్రకృతి - నేనే పురుషుడు.

నేనే జీవుడు - నేనే దేవుడు.

నేనే శిష్యుడు - నేనే గురువు.

నేనే ప్రశ్న - నేనే సమాధానం.

# జ్ఞానాంబ దయామయి

దక్షిణ కైలాసమైన శ్రీకాళహస్తి క్షేత్రంలో పరమశివుడు వాయురూపంలో శ్రీకాళహస్తీశ్వరుడుగా కొలువై ఉన్నాడు. ఇక్కడ పార్వతీదేవి జ్ఞానప్రసూనాంబగా పూజలందుకుంటోంది. ఉమాదేవి జ్ఞానప్రసూనాంబగా ప్రఖ్యాతిగాంచడానికి స్థలపురాణంలో ఆసక్తికరమైన కథ ఉంది.

కైలాసవాసుడు చాలా ముఖ్యులకు మాత్రమే శివపంచాక్షరి మంత్రాన్ని ఉపదేశించేవాడు. అయితే తనకు కూడా మంత్రాన్ని ఉపదేశించాలని అంబిక పట్టుబట్టింది. శివుడు నచ్చ జెప్పినా ఆమె వినలేదు. చివరకు ఓ శుభ ముహూర్తంలో అర్ధాంగికి పంచాక్షరి మంత్రాన్ని ఉపదేశించాడు. తన అందచందాలు చూసి మోహితుడై భవుడు తనకు పంచాక్షరి మంత్రాన్ని ఉపదేశించాడని చెలికత్తెలతో చెబుతుండగా విని ఆగ్రహిస్తాడు. భూలోకంలో మతిలేని స్థితిలో ఉండాలని శపించాడు. తీవ్రంగా బాధపడిన పార్వతీదేవి శాపవిమోచన కోరింది. దక్షిణ కైలాసంలో తపస్సు చేస్తే తిరిగి దివ్య శక్తులు వస్తాయని వరం ప్రసాదించాడు. కైలాసంలో ఆమె వదిలిన దివ్యదేహం భూలోకంలో మారేడు వృక్షం (బిల్వం)గా మారింది. చెలికత్తెలతో భూలోకాన్ని చేరిన ఉమాదేవి దక్షిణకైలాసానికి దారి తెలియక తిరుగుతుండగా వినాయకుడు గుర్తించి తల్లిని దక్షిణకైలాసంలో వదులుతాడు. అక్కడ శివలింగాన్ని ఏర్పాటు చేసుకుని ప్రతిరోజూ పూజలు చేసేది. పలువురు ఋషులు, మునులు ఆమె పూజలను చూసి ఆశీర్వదించారు. చివరకు పరమేశ్వరుడు

ప్రత్యక్షమై గర్వం వల్ల కలిగే అనర్ధాలను వివరించి దివ్యశక్తులను ప్రసాదించాడు. అంతే కాకుండా దక్షిణ కైలాసంలో తనతో పాటు కొలువై ఉండాలని ఆదేశించాడు. పరమశివుడి వద్ద జ్ఞానం పొందడం వల్ల అమ్మవారిని ఇక్కడ జ్ఞాన ప్రసూనాంబికగా కొలుస్తున్నారు. అందువల్లే దేవాలయంలోని అమ్మవారి మూల విగ్రహం శివ పంచాక్షరి మంత్రాన్ని వింటున్నట్లు ఒకవైపు వంగి ఉంటుంది. దీంతో ఈ క్షేత్రంలో అక్షరాభ్యాసాలు విశేషంగా జరుగుతుంటాయి. ఆది శంకరాచార్య ఈ క్షేత్రాన్ని దర్శించి అమ్మవారికి శ్రీచక్రాన్ని ప్రతిష్టించారు. పూజారులు కుంకుమార్చనలను శ్రీచక్రంపై వేసి భక్తులకు ప్రసాదంగా పంచుతారు. ఆ కుంకుమను పెట్టుకుంటే సకల శుభాలు కలుగుతాయి. జ్ఞానప్రసూనాంబ సదా మనవెంటే ఉన్నట్లు అనుభూతి కలుగుతుంది. "కాశీలో కనుమూస్తేగానీ రాని మోక్షం కాళహస్తిలో కాలు పెడితే వస్తుంది." అన్న సామెత అక్షరాల సత్యం.

## అమ్మ జ్ఞానాంబయే సద్గురువుగా అవతరిస్తుంది.

అవతారము దాల్చిన ప్రతి ఒక్కటీ జగన్మాత ఐన పార్వతి స్వరూపమే.

అన్ని ప్రకృతులకు (స్వభావములకు) ఆధార తత్త్వమై నిరాకార పరబ్రహ్మ స్వరూపమై ఉన్న ఆ పరమపురుషునికి అవతారము దాల్చవలసిన అవసరముగాని, అవకాశము గాని లేదు. రంగులరాట్నానికి మధ్య భాగములో అన్ని గుర్రాల పరుగులకు ఆధారమై, అచలమై ఉన్న స్తంభం వంటివాడు పరమేశ్వరుడు.

* * *

ఊరక ఉండడం మాయకు తెలియదు.

కదలడం పరబ్రహ్మానికి తెలియదు.

ఈ రెంటి స్పర్శతో పుట్టినవాడే జీవుడు.

జీవుడు నాణేనికి బొమ్మ బొరుసువలె చల – అచల ప్రవృత్తులను కలిగి ఉంటాడు. అందువల్లనే జీవుడు బంధ మోక్షములకు మధ్య ఊగిసలాడుతుంటాడు.

జీవుడికి శాశ్వతమైన బంధమూ లేదు.

శాశ్వతమైన మోక్షమూలేదు.

ఈ లీల అనంతం.

"ఎందుకు?" అన్న ప్రశ్న అనవసరం.

* * *

ఈ అనంతమైన (ఎప్పటికీ ముగింపు లేని) లీలలో భాగంగానే అమ్మ పార్వతి ఈ భువిపై అవతరించి దక్షిణ కైలాసమను శ్రీ కాళహస్తి పుణ్య క్షేత్రమున జ్ఞాన ప్రసూనాంబికయై విరాజిల్లుతోంది.

సద్గురు సుబ్రహ్మణ్యుని రూపంలో జ్ఞాన ప్రబోధం చేస్తూ జిజ్ఞాసువులకు జ్ఞానార్తిని తీరుస్తోంది.

* * *

రూపాయిలో ప్రతి పైసా నేను అంటుంది.
కాని 'రూపాయి' నేను అనటం వేఱు.

రాజ్యంలో ప్రతి పౌరుడూ నేను అంటాడు.
కాని రాజు 'నేను' అనడం వేఱు.

జగత్తులో ప్రతి జీవి నేను అంటుంది.
కాని దేవుడు నేను అనడం వేఱు.

ఒకటి వ్యష్టి రూపం.
మరొకటి సమిష్టి రూపం.

వ్యష్టి రూపానికి జడం అని పేరు.
సమిష్టి రూపానికి చైతన్యం అనిపేరు.

విద్యుత్ స్పర్శ వలన జడమైన యంత్రంలో కదలిక కలిగినట్లు, దేవుని సంస్పర్శ వలన జడరూపమైన జీవునిలో 'నేను' అన్న అహం స్ఫురణ కలిగింది.

అందువల్లనే దేవుడూ నేను అంటాడు.
జీవుడూ నేను అంటాడు.

* * *

సముద్రంలో కలిసేవఱకు నదికి ఒడిదుడుకులతో కూడిన ప్రవాహం ఉన్నట్లు, దేవునిలో కలిసేవఱకు జీవునికి సుఖ దుఃఖరూపంతో కూడిన సంసారం ఉంటుంది.

'దేవునికి విడిగా నాకు ఉనికి లేదు. నేను పరిపూర్ణుడను' అని జీవుడు గ్రహించేవఱకు జీవుడు పడే తపనే ఆధ్యాత్మికం అయ్యింది.

జీవుని తపన తపస్సుగా మారటానికి ఆ దేవుని 'శక్తి' అనేక రూపాలతో ఈ భూమ్మీద అవతరించి అనుగ్రహిస్తుంటుంది. అందులో ఓ రూపమే "శ్రీసద్గురు సుబ్రహ్మణ్యం".

అనిలాచలశివుని సగభాగమైన శ్రీజ్ఞానప్రసూనాంబికా దేవి శ్రీసద్గురువుగా అవతరించి అనుగ్రహించిన దివ్యోపదేశమే ఈ 'జ్ఞానప్రసూనాలు'.

అమృతపానం చేసిన క్షణమే అమృతుడైనట్లు ఈ దివ్యగ్రంథాన్ని పారాయణం చేసిన క్షణమే పూర్ణానుభవం కలగడం తథ్యం.

సాధారణంగా పాఠకుడు గ్రంథాన్ని ఎన్నుకుంటాడు. కానీ ఈ గ్రంథం పాఠకుణ్ణి ఎన్నుకుంటుంది.

* * *

శ్రీ సుబ్రహ్మణ్య గురుదేవులవారు శ్రీకాళహస్తికి 5 మైళ్ళ దూరంలో ఉన్న కొణతనేరి అనే గ్రామంలో విజయలక్ష్మి - సిద్దయ్య అనే పుణ్య దంపతులకు 24-8-1942న జన్మించారు.

వారిది వ్యవసాయ కుటుంబము.

19 ఏట పద్మావతిగారితో వివాహం. శంభు, కృష్ణ, యుగంధర్ ముగ్గురు సంతానం.

1975న ఉద్యోగరీత్యా శ్రీకాళహస్తి కైకాలవీధియందు కాపురం పెట్టడం జరిగింది.

* * *

శ్రీ సద్గురు దేవులవారు తన ఉపాధ్యాయ వృత్తిలో కొనసాగిస్తూనే తత్త్వ సంబంధమైన వ్యాపకాలతోను, గురువులతోను కాలం గడిపేవారు. 1988లో నేను, నా స్నేహితుడు ఒబ్బు ప్రసాద్ ఇద్దరమూ సద్గురు సన్నిధికి చేరి ఆ దివ్యమైన సద్గురు సత్సంగానికి తొలి సభ్యులైనాము. ప్రతి ఏటా సత్సంగంలో శ్రీరమణ జయంతి కార్యక్రమాలను నిర్వహిస్తుండడం వలన, నేను స్వయంగా శ్రీరమణ ప్రేమికుడు కావడం వలన ఆ సత్సంగానికి 'రమణ సత్సంగం' అని పేరు పెట్టడం జరిగింది.

* * *

శ్రీసద్గురు దేవులవారికి తొలి ఆధ్యాత్మిక గురువు శ్రీవీరయ్యగారు. బ్రహ్మంగారి మనవరాలు అయిన ఈశ్వరమ్మగారి శిష్యుడైన శ్రీశంభుగురుస్వామి శిష్యుడే శ్రీవీరయ్యగారు. వీరయ్యగారు పిన్న వయసులో పశువుల కాపరి. ఊరి చివర్లోకి వాటిని తీసుకెళ్లి మేపేవాడు. అక్కడే ఉన్న శంభుగురుస్వామి సమాధి అరుగుపై విశ్రాంతి తీసుకునేవాడు.

ఓ రాత్రి శంభుగురుస్వామి దివ్యతేజస్సుతో వెలిగిపోతూ దర్శనమిచ్చారు వీరయ్యగారికి. రా! నావెనుక అని ఆదేశించారు. మైకం కమ్మినవాడిలా అలా స్వామి వెనుకే నడచి వెళ్లి పోతున్నాడు. ఊరి చివర నీటి కొలను వద్దకు తీసుకెళ్లి మంత్రోపదేశం చేశారు వీరయ్యగారికి.

అప్పట్నుంచి వీరయ్యగారికి కొన్ని దివ్యశక్తులు కలిగాయి. ఏ జాతక చక్రాలు వేయకనే మనిషిని అలా చూడగానే వారి భవిష్యత్తు

అంతా చెప్పేసేవారు.

“నీకు ఈ శక్తులెలా కలిగాయి?” అని అడిగితే ‘నా గురువు శంభుగురు స్వామి అనుగ్రహం’ అనేవాడు. ఊళ్లో వాళ్లంతా నవ్వుకున్నారు. కారణం శంభుగురుస్వామి 300 ఏళ్ల క్రితమే సమాధి అయ్యారు. ఇప్పుడెలా నీకు గురువవుతాడు? అని హేళన చేసేవారు.

వీరయ్యకు ఓరోజు పౌరుషం వచ్చి సమాధి తవ్వేశారు. ఊరి జనమంతా అక్కడకు చేరింది. శంభుగురుస్వామి శిరోభాగం కనబడింది. ఎగతాళి చేసిన వారంతా వీరయ్య పాదాలపై పడి క్షమాపణ కోరారు.

వీరయ్య శాంతించారు.

తిరిగి సమాధి మూసేసారు.

* * *

శ్రీ సద్గురు సుబ్రహ్మణ్యులవారి సతీమణి పద్మావతమ్మగారి బావగారే ఈ వీరయ్యగారు.

గురువుగారికి పెళ్లయిన క్రొత్తలోనే వీరయ్యగారి ఆధ్యాత్మిక శక్తిని గుర్తించి వారి పాదాలకు అంకితం అయిపోయారు.

“నీకు మొదట మగసంతానం కలుగుతుంది. ఆ పిల్లాడికి మా గురువు గారైన “శంభుగురు” పేరు పెట్టు. అని ఆశీర్వదించారు. వీరయ్యగారు అన్నట్టుగానే గురువుగారికి మగ సంతానం కలిగింది. “శంభు ప్రసాద్” అని నామకరణం చేశారు.

శ్రీవీరయ్యగారు శ్రీవిద్యోపాసకులు "శ్రీపీఠం" ఇస్తాను తీసుకో అన్నారు.

"మీ ఆశీర్వాదం ఒక్కటి చాలు. ఏ పీఠమూ నా కొద్దు" అన్నారు గురువుగారు.

"అది ఎప్పుడూ ఉంటుంది" అని ఆశీర్వదించారు వీరయ్యగారు.

ఆ ఆశీర్వాదమే ఇప్పటివఅకు నన్ను నడిపిస్తోంది అంటారు గురువుగారు.

* * *

రెండవ ఆధ్యాత్మిక గురువు శ్రీతాతగారు. హిమాలయ యోగి. గురువుగారికి తాతాగారు 1970లో పరిచయం అయ్యారు.

తాతగారు 1916లో శ్రీషిరిడీసాయి బాబాను ప్రత్యక్షంగా దర్శించారు. బాబా మధ్వా బ్రాహ్మణుడని వారు అన్నారు.

తాతగారు చాలా కోపిష్టి. అందర్నీ తెగ తిట్టేవారు. దేవతలను కూడా.

జ్ఞానాంబ, సుబ్రహ్మణ్య స్వామి, వేమన ఈ ముగ్గురిని మాత్రం గౌరవంతో నమస్కరించుకునేవారు.

గంజాయి, సారాయి, బీడి, టీ, త్రాగేవారు.

ఏడాదికి ఒకటి రెండు సార్లు మాత్రం

బిరియాని తెప్పించుకుని తినేవారు.

వీరి సంరక్షణలో గురువుగారు 90 రోజులు ఉపవాస దీక్ష చేశారు.

తాతగారు 18.10.1990న మహానిర్యాణం పొందారు. అప్పటికి తాతగారి వయస్సు 101.

* * *

గురువుగారి ప్రబోధ సారాన్ని ఒక్కముక్కలో చెప్పాలంటే-

"నాతో సహా సర్వమూ నాలో ఉన్నట్లున్నది"

* * *

"నేను" ఒక్కటే సత్యము (ఉన్నది)

నామరూపాలతో కూడిన నేను,

ఈనేనుకు ముడిపడి ఉన్న జగత్తు

మొత్తం కలిపి అసత్యమే (ఉన్నట్లున్నది)

ఈ విషయం అర్థమైతే

ఇక తాను ఏమిగా ఉన్నా

తనకేమీ ఇబ్బంది ఉండదు.

ఆ ఇబ్బంది లేని స్థితియే మోక్షము.

* * *

"శ్రీ సద్గురు బోధలను ప్రత్యక్షంగా విన్నవారు ధన్యులు" అన్నారు అన్నాజీరావుగారు. ఇది నిజం.

వారి పాదాల వద్ద కూర్చొని ఆ దివ్యమైన ప్రబోధాలను వింటుంటే  చెవి నుంచి హృదయానికి ఎడతెగని ఓ అమృతపుధార ప్రవహిస్తున్నట్టుండేది.

విన్న బోధలను నేను తిరిగి వ్రాసుకునే వాడిని. అవే 'జ్ఞాన ప్రసూనాలు'గా ప్రచురింపబడ్డాయి. ఆ దివ్యబోధనలను తిరిగి వ్రాసుకోవడంలో ఆ మాధుర్యం తగ్గి ఉండేది. కారణం, అనుభవానికి మాత్రమే పరిమితమైన ఆ పరతత్త్వాన్ని పరిమితులు కలిగిన భాషలో ఇరికించాలని ప్రయత్నించడమే.

సద్గురు సన్నిధిలో మౌనమే గొప్ప ఉపదేశంగా ఉండేది.

ఆ మౌనాన్ని ఏ భాషలో ఎలా వ్రాసుకోగలం?

కాబట్టి జ్ఞాన ప్రసూనాలు అనేవి సద్గురు యొక్క యధార్ధ స్వరూపం కానే కాదు.

సద్గురు స్వరూపాన్ని ఊహించి బాబు గీసుకున్న ఊహా చిత్రమే ఈ జ్ఞాన ప్రసూనాలు.

సద్గురు సన్నిధికి చేర్చడానికి ఉపయోగపడే చిరునామా మాత్రమే ఈ జ్ఞాన ప్రసూనాలు.

* * *

మబ్బుల నుండి మేడపై పడిన వర్షపు నీరు సింహపు బొమ్మ నోటి నుండి జాలువారినట్లు విశ్వచైతన్యానికి అధిష్టానదేవత అయిన జ్ఞాన ప్రసూనాంబ తన దయా హృదయం నుండి వెలువడిన ఆ దివ్యవాణిని

జిజ్ఞాసువులైన తన శిశువులకు అందించడానికి ఉపయోగించుకున్న ఉపకరణమే శ్రీసద్గురు సుబ్రహ్మణ్య గురుదేవులవారు.

వారి బోధల్లో ఏదైనా క్రొత్త విషయం ఒకటి దొర్లినప్పుడు–

"నేను కూడా మీతో పాటు ఇప్పుడే విన్నాను"....

"నాక్కూడా ఈ విషయం ఇప్పుడే తెలిసింది." అనడం కద్దు.

తన ప్రబోధాలకు తానే మొదట శ్రోతగా ఉంటారు. నేను చెప్పాను అన్న అహం వారికి ఏ కోశానా ఉండేది కాదు. నిత్యవ్యవహారాల్లో సైతం 'కీ' ఇచ్చిన బొమ్మలా తటస్థంగా ఉండి తన పనిని తాను అలా చేసుకుంటూ వెళ్లిపోతారు. ఏ పని చేస్తున్నా, మాట్లాడుతున్నా వారి ముఖంలో చిరునవ్వు చెరిగేది కాదు.

* * *

ప్రపంచానికి హృదయం అరుణాచలం.

జ్ఞానానికి హృదయం అనిలాచలం.

అరుణాచలంలో సుబ్రహ్మణ్యుడు రమణుడుగా ఉన్నాడు. అనిలాచలంలో రమణుడు సుబ్రహ్మణ్యుడుగా ఉన్నాడు.

* * *

అరుణాచల రమణుని తత్త్వ వైభవానికి కొనసాగింపే శ్రీసద్గురు సుబ్రహ్మణ్యులు.

రమణ సన్నిధిలో ఉన్నంత శాంతి, కాంతి శ్రీసద్గురు సన్నిధిలోనూ నిండి ఉంటుంది.

ఇంట్లో ఓ మూల ఉన్న పూలకుండీ నుండి వెలువడిన పరిమళం ఆ గదంతా నిండిపోయినట్లు ప్రపంచంలో ఏ మూల ఏ మహనీయుడు గుట్టుగా జీవిస్తున్నా వారి ఉనికి లోకానికంతా శ్రేయస్కరం అవుతుంది.

వారి అనుగ్రహం ప్రతి జీవికి సమంగా పంచబడుతుంది.

అందుకే వేలమంది సంస్కర్తలు చేయలేని పనిని గుహలో కూర్చునే ఓ ఋషి నిశ్శబ్దంగా పూర్తి చేయగలడు.

సద్గురు ఉనికే లోకానికి ఆశీర్వాదం.

* * *

నా 9వ ఏట మా అమ్మా నాన్న శ్రీరమణాశ్రమానికి వెళ్లారు. నన్ను మా పెద నాన్న వద్ద వదిలి పెట్టి.

మా అమ్మగారు శ్రీరమణాశ్రమాన్ని దర్శించి గొప్ప ఆనందాన్ని పొందింది. తిరిగొచ్చాక శ్రీమహర్షి గురించి గొప్పగా వర్ణించి చెప్పింది.

"ఆహా! యోగి అంటే అలా ఉండాలి!" అన్న అభిప్రాయం ఆ చిన్న వయస్సులోనే నాకు కలిగింది.

* * *

కాలేజీ చదివే రోజుల్లో ఇళయరాజా సంగీతమన్నా, చలం సాహిత్యమన్నా బాగా ఇష్టపడే వాడిని. వ్రాసిన పుస్తకాల్ని బాగా చదివేవాడిని. ఆయన పుస్తకాల్లో అక్కడక్కడ రమణాశ్రమం, రమణ భగవాన్ ప్రస్తావన వస్తూ ఉండేది.

* * *

**1990 మే 19న శ్రీసద్గురు దేవులవారు నాకు అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించారు.**

**1995లో శ్రీదత్తమాలా మంత్రాన్ని వ్రాసిచ్చి ప్రతిదినం 11సార్లు చొప్పున 40 రోజులు పారాయణం చేయమన్నారు. పూర్తి అయ్యే లోపు ఒక అవధూత దర్శనం అవుతుందని చెప్పారు.**

## శ్రీదత్తా మాలా మంత్రము

**ఓం నమో భగవతే దత్తాత్రేయాయ**

**స్మరణమాత్ర సంతుష్టాయ**

**మహాభయ నివారణాయ**

**మహాజ్ఞానప్రదాయ**

**చిదానందాత్మనే**

**బాలోన్మత్త పిశాచవేషాయ**

**మహాయోగినే**

**అవధూతాయ**

**అనసూయానంద వర్ధనాయ**

**అత్రిపుత్రాయ**

**సర్వకామఫలప్రదాయ**

ఓం భవబంధ విమోచనాయ

ఆం అసాధ్యసాధనాయ

హ్రీం సకల విభూతిదాయ

క్రోం అసాధ్యా కర్షణాయ

ఐం వాక్ర్పదాయ

క్లీం జగత్రయ వశీకరణాయ

సౌః సర్వమనక్షోభణాయ

శ్రీం మహాసంపత్ర్పదాయ

గ్లౌం భూమండలాధిపత్య ప్రదాయ

ద్రాం మహా చిరంజీవినే

వషట్ వశీకురు వశీకురు

వౌషట్ ఆకర్షయ ఆకర్షయ

హుం విద్వేషయ విద్వేషయ

ఫట్ ఉచ్ఛాటయ ఉచ్ఛాటయ

ఠః ఠః స్తంభయ స్తంభయ

ఖేం ఖేం మారయ మారయ

నమః సంపన్నాయ సంపన్నాయ

స్వాహా పోషయ పోషయ

పరమంత్ర పరయంత్ర పరతంత్రాణి

ఛింది ఛింది గ్రహాన్నివారయ నివారయ

వ్యాధీన్ వినాశయ వినాశయ

దుఃఖం హరయ హరయ

దారిద్ర్యం విద్రావయ విద్రావయ

దేహం పోషయ పోషయ

చిత్తం తోషయ తోషయ

సర్వమంత్ర స్వరూపాయ

సర్వయంత్ర స్వరూపాయ

సర్వతంత్ర స్వరూపాయ

సర్వపల్లవ స్వరూపాయ

ఓం నమో మహాసిద్ధాయ స్వాహా ॥

ఇది శ్రీ గురుదత్తాత్రేయ చరణారవిందార్పణమస్తు....

ఓం శాంతిః శాంతిః శాంతిః

* * *

పారాయణం ప్రారంభించిన 6వ రోజునే ఇంట్లో కూడా చెప్పకుండా శ్రీరమణాశ్రమం వెళ్లాను. అదే నా రమణాశ్రమ ప్రథమ సందర్శనం (16.05.1995) శ్రీరమణ మహర్షి కంటే గొప్ప అవధూత ఇంకెవరున్నారు? అని అనుకున్నాను.

ఆశ్రమం ఇంకా ఫర్లాంగు దూరం ఉండగానే ఆశ్రమ నెమళ్లు తమ షడ్జమ స్వరాలతో స్వాగతం పలికాయి.

ఆశ్రమంలో ప్రవేశించగానే నాగుమల్లి సువాసన చిరునవ్వుతో పలుకరించింది.

నాకేమీ ఏదీ క్రొత్తగా తోచలేదు. చాలా కాలం తర్వాత నా పుట్టినింటికి వచ్చి చేరుకున్నాననిపించింది. భగవాన్ సమాధిని దర్శించగానే తప్పిపోయిన బిడ్డ తిరిగి తన తల్లి వద్దకు చేరినట్లు శుకుడు జనకుడి వద్ద సమాధానం పొందినట్లు నామనస్సు శాంతించింది.

పాతహాల్లో నేలని తడిమి తడిమి చూసుకున్నాను. అది భగవానుల పాద స్పర్శతో పునీతమైన నేల కదూ! భోజన హాలు ముందు నుంచి వెళుతుంటే, ఒకతను తలుపు తెరచి–

"భోజనం చేశావా?" అని అడిగాడు.

"లేదు" అన్నాను.

"రండి" అని చెప్పి లోపలికి తీసుకెళ్లి విస్తరి వేసి తృప్తిగా భోజనం పెట్టాడు. మామూలుగా అయితే ఆఫీసు అనుమతి లేనిదే ఎవరినీ లోపలకు రానివ్వరు. భగవానే ఆ రూపంలో వచ్చి నాకు భోజనం తినిపించారు.

ఇంతలోనే అనుకోకుండా తెలుగు వారొకరు పరిచయమై స్కందాశ్రమం, విరూపాక్ష గుహ చూపించారు. చార్జీల వరకు డబ్బులుంచుకుని మిగతా డబ్బులతో రమణ సాహిత్యాలను కొనేశాను.

* * *

శ్రీరమణానుగ్రహాన్ని పొందడానికి నేను చేసిన పూజలేమిటో, వ్రతా లేమిటో అని ఆలోచిస్తుంటాను అప్పుడప్పుడు. ఒకవేళ అటువంటి పూజలు, పుణ్యాలు చేయకపోయినా గత జన్మలో ఆయన పాదాల క్రింద నలిగి చనిపోయిన ఏ పురుగునో లేక ఆయన చేతుల మీదుగా అరటిపండు తీసుకున్న ఏ కోతినో లేక ఆయన ఆశ్రమ గేటు వద్ద నిలబడి కొంత కబళాన్ని పొందిన ఏ దీన భిక్షువునో లేక ఏ ఉడుతనో, ఏ పామునో, ఏ పులినో...

మొత్తానికి శ్రీరమణ భగవానులతో బాంధవ్యాన్ని ఈనాటి జీవితంలో సంపాదించుకున్నది మాత్రం కాదని అనిపించేది.

కచ్చితంగా నేను గత జన్మలో భగవాన్ స్పర్శను పొందిన జీవినని గాఢంగా అనిపించేది.

భగవానులు అన్నారు కదా "నా అనుగ్రహం లేనివాడు నా పేరు ఎత్తలేడు" అని.

జన్మనిచ్చేవాడు తండ్రి. జన్మేలేకుండా చేసేవాడు పరమ తండ్రి. శ్రీరమణులు పరమ తండ్రి.

## ఓం నమో భగవతే శ్రీరమణాయ

భగవాన్ శ్రీ రమణ మహర్షి తమిళనాడు మధురైకు దగ్గరగా ఉన్న తిరుచ్చుళి అనే గ్రామంలో అళగమ్మ సుందరమయ్యరు అనే పుణ్యదంపతులకు పునర్వసు నక్షత్ర పుణ్య దినాన అనగా **30** డిశంబరు **1879**న జన్మించారు.

భగవాన్ తన 16వ ఏట ఒకసారి మధ్యాహ్నం మేడపై పడుకుని ఉండగా హఠాత్తుగా శ్వాస ఆగిపోయినట్లు, దేహం బిగుసుకుపోయి చనిపోయినట్లు అనుభూతి కలిగింది. శరీరం నిర్జీవం అయిపోయినా కూడా ఆయన ఆలోచన ఇట్లా కొనసాగింది. ఇప్పుడు ఈ శరీరం చనిపోయింది. దీన్ని స్మశానానికి తీసుకుపోయి దహనం చేస్తారు. అది కాలి బూడిద అవుతుంది. కాని "నేను" అనేది మాత్రం శరీరంతోపాటు చావక మిగిలివుంది. కాబట్టి "నేను" అనేది శరీరం కాదు. ఈ "నేను" శరీరంతోపాటు చచ్చేదికాదు. అనే భావం అతనిలో స్థిరపడింది. నేను ఈ శరీరాన్ని కాను "నేనున్నాను" అనే ఎఱుకయే "నేను" అని తెల్సుకున్నారు. ఇదంతా కేవలం ఆలోచనగా కాక అనుభవంగా మారుకుంది. వెంటనే శరీరంలో చలనం వచ్చి మామూలుగా అయినారు.

ఆ స్వానుభవంతో మనిషి ఋషి అయినారు. వైరాగ్యం పెరిగింది. బాహ్య విషయాలపై ఆసక్తి తగ్గింది. ఇల్లు విడిచి అరుణాచలం చేరారు. శివలింగాన్ని కౌగిలించుకుని తండ్రీ! నీ ఆజ్ఞ మేరకు వచ్చాను. అని ఆనంద భాష్పాలతో అభిషేకించారు. నమస్కారం చేయలేదు. సాష్టాంగ పడలేదు. ప్రదక్షిణం చేయలేదు. ఏ స్తోత్రమూ చేయలేదు. తండ్రీ! అని సంభోదించారు, శరణాగతానికి గొప్ప అర్థం చూపారు. ప్రయాణంలో మిగిలిన పైకాన్ని బయట కోనేరులో పారేశారు. కౌపీనం (గోచీ) ధరించారు. మౌనం పట్టారు. అరుణాచలమే సింహాసనంగా ఆధ్యాత్మిక సామ్రాజ్యాన్ని ఏలారు 54ఏళ్ళు.

ఇంట్లో వాళ్ళు ఇతని కోసం దేశమంతా గాలించారు. అరుణాచలంలో యోగిగా ఉన్నాడని తెలిసి బయలుదేరింది తల్లి. కుమారుని అవతారం చూసి భోరుమని ఏడ్చింది. తనతో ఇంటికి రమ్మంది. స్వామి మౌనం వీడలేదు. ప్రక్కనున్నవారు పెన్సిలు కాగితం ఇచ్చి తల్లికి ఏదైనా తెలియజేయమన్నారు.

అందులో ఇట్లా వ్రాశారు "కర్త (ఈశ్వరుడు) వారి వారి ప్రారబ్ధ కర్మానుసారము జీవులను ఆడిస్తున్నాడు. జరగవలసిన దానిని ఎవరెంత అడ్డుపెట్టినా జరిగి తీరుతుంది. జరుగనిది ఎవరెంత ప్రయత్నించినా జరుగనే జరుగదు. ఇది సత్యము, కనుక మౌనముగా ఉండుటయే ఉత్తమం" అని. కుమారుని ఉన్నత స్థాయిని గుర్తించి ఆమె తన జీవిత అంత్యం వరకు భగవాన్‌తోనే గడిపి, ఆయన ఒడిలోనే చివరి శ్వాసను విడచింది. భగవాన్ ఆమెకు ముక్తిని ప్రసాదించారు.

తిరుపతి వేంకటకవులు సైతం పాదాభివందనం చేసిన మహాకవులు, తపస్వి, మంత్రద్రష్ట అయిన శ్రీ కావ్యకంఠ గణపతిముని భగవాన్‌ను దర్శించి "భగవాన్! నేను చదువని శాస్త్రం లేదు జపించని మంత్రం లేదు. అయినా నేను శాంతిని పొందలేకున్నాను, మార్గం చూపండి" అని వేడుకున్నారు.

'భగవాన్' కరుణతో తన 12 ఏళ్ల మౌనాన్ని వీడి గొంతు సవరించుకుంటూ మెల్లమెల్లగా ఇట్లా చెప్పారు. "నేను - నేను" అని అంటున్నావే ఈ "నేను" అనేది ఎక్కడ నుంచి పుడుతుందో గమనించి

చూడు. మనస్సు అందులో లీనమవుతుంది. అదియే తపస్సు. మంత్రాన్ని జపించేటప్పుడు మంత్ర నాదం యెక్కడ నుంచి పుడుతుందో గమనించి చూడు. మనస్సు అందులో లీనమవుతుంది. అదియే తపస్సు" అని ఉపదేశించారు. శ్రీకావ్యకంఠ గణపతిముని ఆ దివ్యమైన ఉపదేశానికి పులకించిన వాడై సాష్టాంగపడి ఆశువుగా భగవాన్ మీద శ్లోకాలు పాడారు.

గణపతిముని తన దివ్యదృష్టితో చూచి 'భగవాన్ శ్రీ రమణ మహర్షి' సాక్షాత్తు పార్వతీదేవి ముద్దుల కుమారుడైన కుమారస్వామి అవతారమని నిరూపించి లోకానికి చాటారు.

కుల, మత ప్రమేయం లేకుండా లక్షలాదిమంది జనం చేరారు. ప్రశ్నలు వేసి సమాధానం పొందారు. అవన్నీ పెద్దపెద్ద గ్రంధాలయినాయి. చిన్నగుడిసె ఇప్పుడు పెద్ద గుడి అయింది. భగవాన్ మాత్రం గోచీ, తుండుగుడ్డ, ఊతకర్ర, కమండలం తప్ప ఇంకేవీ ముట్టుకోలేదు. ఇవే ఆయన ఆస్తి.

ఒక్క మానవులకే గాక, గోవు, జింక, కాకి, కుక్క మొదలైన జీవజాలానికి కూడా ఆయన ముక్తిని ప్రసాదించారు. నేటికీ శ్రీ రమణ మహర్షి ఆశ్రమంలో వీటి సమాధులు ఉన్నాయి.

చివరికి భగవాన్ **1950** ఏప్రిల్ **14**వ తేది రాత్రి **8-47** నిమిషాలకు మహా నిర్యాణం పొందారు. ఒక జ్యోతి రూపంలో ఆయన అరుణాచలంలో కలిసిపోయారు. ఈ జ్యోతిని వేలాది భక్తజనమంతా

చూసి తరించారు. నేటికీ రమణ మహర్షి సమాధి సన్నిధిలో గొప్ప శాంతి ఆవరించి ఉంటుంది.

## నిన్ను నీవు తెలుసుకో

ఆయన ఉపదేశసారమంతా ఒక్కటే "నిన్ను నీవు తెలుసుకో" అని. ఇప్పుడు "నేను" అనేది దేహం వరకే పరిమితమైపోయింది. నేనెవడను? అనే ఆత్మశోధన ద్వారా ఈ దేహ పరిమితమైన "నేను" (ఆత్మ)గా మారుకుంటుంది. అంటే చిన్న నది సముద్రంలో కలిసి అనంతమయిన తత్త్వంగా మారుకున్నట్లు, ఈ చిన్న "నేను" ఆ గొప్ప "నేను"లో కలిసిపోతుంది. అదే ముక్తి అంటే. ఇంకేమీ కాదు.

జ్ఞానులు చెప్పే ఆత్మకు, భక్తులుచెప్పే దైవానికి, రమణ మహర్షి చెప్పే ఈ "నేను"కు ఏ తేడా లేదు. ఆత్మ – దేవుడు – ఓంకారం – నేను ఈ నాలుగూ ఒక్కటే అర్థం. భగవంతునికి నిజమయిన పేరు, అర్థం "నేను" అంటారు భగవాన్. నేను ఎవడను? అనే ఆత్మశోధనకన్నాగొప్ప కర్మగాని, గొప్ప భక్తిగాని మరేదీలేదు "నేను"ను తెల్సుకుంటే ఏక కాలంలో అన్నీ తెల్సుకున్నట్లే. నేనెవడను? అనే ఆత్మవిచారం ద్వారా మనమందరం తరియింతుముగాక.

**- T.V.N. బాబు**

శ్రీరమణ సత్సంగం

శ్రీకాళహస్తి.

సెల్ 9533667918



# నేనే ప్రశ్న – నేనే సమాధానం

1. బాబు : 'నేనే ప్రశ్న - నేనే సమాధానం' గ్రంథం చదవటానికి అర్హత ఏమి?

సద్గురు : ఆర్తి.

2. బాబు : 'నేనే ప్రశ్న–నేనే సమాధానం' అంటే అర్థమేమి?

సద్గురు : ప్రశ్నించేవాడే సమాధానం.

3. దేవీప్రసాద్ : ప్రశ్నే పుట్టని స్థితిని సాధించడం ఎలా?

సద్గురు : 'నేను' పుట్టని చోటుకు చేరుకుంటే సరి.

4. దేవీప్రసాద్ : ఆనందం అంటే?

సద్గురు : స్వస్వరూపము.

5. బాబు : తలంపులను అణచి ఆత్మ తెలుసుకోవాలని అంటారు...

సద్గురు : ఇది చాలా శ్రమతో కూడిన సాధన. తలంపు రూపంగా ఉన్నది ఆత్మయే అని తెలుసుకుంటే, తరువాత తలంపులు వచ్చినా నీవు తలవని వాడివే అవుతావు.

6. బాబు : భగవత్సాక్షాత్కారము అంటే?

సద్గురు : మనం పదిమంది ఉంటే, పదకొండవ వాడు కాదు భగవంతుడు. మన పది మంది రూపాల్లో ఉండేది భగవంతుడే అని తెలుసుకుంటే అదే భగవత్సాక్షాత్కారము.

7. బాబు : ప్రత్యేకించి సాధన అవసరం లేదంటారా?

సద్గురు : అవసరం లేదు 'అతడే నేను' అన్న జ్ఞప్తి ఉంటే చాలు.

8. బాబు : మరి దేశంలో ధ్యాన కేంద్రాలు ఇబ్బడి ముబ్బడిగా వెలిశాయి....!

సద్గురు : ఈ ధ్యానకేంద్రాలలో సాధన చేయడం కంటే శ్మశానంలో ఏదయినా సమాధి అరుగుమీద కాసేపు కూర్చొని గడపడం మంచిది. అంతకు మించి సాధనే లేదు. ఆ సమయం నీకు ఎన్నో జీవిత సత్యాలను ప్రబోధిస్తుంది.

9. బాబు : సన్న్యాసం తీసుకునేముందు తల్లి లేదా భార్య అనుమతి తప్పనిసరి అంటారే...

సద్గురు : పొందవల్సినదానిని పొందిన తరువాత సన్న్యాసం తీసుకునేవానికి ఎవరి అనుమతీ అవసరం లేదు.

ఉదా ॥ శ్రీరమణమహర్షి.

సన్న్యాసం తీసుకుని పొందాలి అని అనుకున్న వానికి తల్లి లేదా భార్య అనుమతి తప్పనిసరి.

ఉదా ॥ శ్రీ ఆదిశంకరులు.

10. చిలకమ్మ : ఇక ఈ జన్మ చాలు అనుకుంటున్నాను స్వామీ...

సద్గురు : కథలోని ఓ పాత్ర ఇక నాకు ఈ పాత్ర చాలు అనుకుని రచయితకు తెలియకుండా కథలోంచి విరమించుకునే వీలు ఆ పాత్రకు ఉంటుందా?

ఏ పాత్రను ఎప్పుడు ప్రవేశపెట్టాలో, ఎప్పుడు నిష్క్రమింపచేయాలో విశ్వకథా రచయిత అయిన భగవంతుని ఇచ్ఛానుసారంగానే జరుగుతుంది.

11. శశిరేఖ : లోకాన్ని ఉద్ధరించడం కాదు.
ముందు నిన్ను నీవు ఉద్ధరించుకో
అని శ్రీరమణ భగవానులు అన్నారు.

లోకోద్ధరణే మోక్షదాయకమన్నట్లు
శ్రీవివేకానందులు ప్రబోధించారు.
ఏది వాస్తవం?

సద్గురు : అంతర్ముఖంలో తనను తానుచూసుకునే
ఉపాయాన్ని బోధించినవారు - శ్రీరమణులు.
బహిర్ముఖంలో తనను తాను చూసుకునే
ఉపాయాన్ని బోధించినవారు -శ్రీవివేకానందులు.

12. పట్టెయ్య : ఆధ్యాత్మిక జ్ఞానం వలన దేనికీ
అంటని స్థితి నాకు కలిగిందండి...

సద్గురు : మంచిది. ఇక పట్టెయ్యను కూడా అంటని స్థితిని సాధించు.

13. గురప్ప : రమణ భగవానులు తాను అవతార పురుషుడనని ఎక్కడైనా చెప్పి ఉన్నారా?

సద్గురు : చెప్పి ఉండేవాడే, కాని చెప్పడానికి ఆయనకు ఇతరం కనిపించలేదు.

14. బాబు : గురుదక్షిణ గురించి చెప్పండి. . .

సద్గురు : నీవు ఎవరికి ఏమిచ్చినా, తనకు తాను ఇచ్చుకున్నట్లుగా నీకు తోస్తే అదే గురుదక్షిణ.

15. హరి : మోక్షం అంటే ఏమిటి?

సద్గురు : దైవం కంటే భిన్నంగా ఏదీలేదు. నేను కూడా దైవమే అన్న అనుభవమే మోక్షం.

16. సద్గురు : బాబూ! ఈ రోజంతా ఒక్కసారైనా 'ఈ జాగ్రదవస్థ స్వప్నం లాంటిదే' అన్న జ్ఞప్తి నీకు కలిగిందా?

బాబు : లేదండి . . .

సద్గురు : అయితే ఈ రోజు నీవు ఒక్కసారి కూడా భగవంతుణ్ణి తలవనట్లే.

'ఈ జాగ్రదవస్థ స్వప్నం లాంటిదే' అన్న జ్ఞానం ఒక్కటుంటే చాలు.

అన్ని జ్ఞానాలూ నీకున్నట్లే.
సదా భగవంతుణ్ణి నీవు తలుస్తున్నట్లే.

**17.** బాబు : ఆత్మ అంటే?

సద్గురు : ఒక వస్తువు ఉండాలంటే, కొంత అవకాశం ఉండాలి కదా! అలాగే సకల సృష్టికి ఆధారమైన విశ్వాంతరాళం ఉండడానికి అవకాశంగా ఉన్నదేదో అదే ఆత్మ.

**18.** బాబు : పురుషోత్తముడు అంటే?

సద్గురు : ఉత్తమ పురుషము (నేను) యొక్క
తత్త్వాన్ని ఎఱిగినవాడు.

**19.** చిలకమ్మ : ఎందుకు నేను ఈ బాధలు పడాలి?

సద్గురు : ఎందుకు పడకూడదు?

**20.** చిలకమ్మ : జ్ఞానులు పొందిన స్థితిని నేనెందుకు
పొందలేకపోతున్నాను?

సద్గురు : మీరు ఆ స్థితిని పొందలేదని
చెప్పిన జ్ఞాని యెవరు?

**21.** చిలకమ్మ : ఆలస్యాన్ని భరించలేకున్నాను.
త్వరగా ముక్తిని పొందటానికి
మార్గం చూపండి.

సద్గురు : మీరు మీ ఇంటికి చేరటానికి
మార్గం ఎవరు చూపగలరు?

22. బాబు : బ్రహ్మము అంటే?

సద్గురు : ఏ మనస్సయితే, తనతో సహా
సకలాన్ని త్రోసివేస్తుందో
ఏ మనస్సయితే, సకలాన్ని తనలో
ఇముడ్చుకుంటుందో
ఆ మనస్సే బ్రహ్మము.

23. బాబు : భగవద్గీతా సారమేమి?

సద్గురు : Don't Expect

24. బాబు : ఆత్మానుభవం అంటే?

సద్గురు : ఉన్నదానిని ఉన్నట్లుగా
ఒకటిని ఒకటిగా
దానినే అదిగా
తననే తానుగా
అనుభవించడమే ఆత్మానుభవము.

25. ప్రశ్న : శాకాహారి అంటే?

సద్గురు : తన దేహాన్నే మాంసపు ముద్దగా భావించి తనకు
తానే దూరంగా ఉండేవాడు.

26. ప్రశ్న : దిగంబరుడు అంటే?

సద్గురు : తను - సంసార - ప్రపంచ - దైవములను
వదిలినవాడు.

27. ప్రశ్న : అమనస్క స్థితి అంటే?

సద్గురు : కర్తృత్వ భావన తొలగడం.

28. సద్గురు : జ్ఞానాన్ని మనం సంపాదించేదికాదు
జ్ఞానం ఎవరిని ఎన్నుకుంటుందో
వారే జ్ఞానులవుతారు.

చిన్నా : అది కొంతమందినే ఎందుకు ఎన్నుకొంటుంది?

సద్గురు : దాని గురించి ఇదమిత్థంగా ఏమీ చెప్పలేం.

29. పట్టెయ్య : భగవద్గీతలో -
నా మాయ దాటనలనవి గానిది.
నన్ను శరణుబొందిన వారికి
ఈ మాయ సులభసాధ్యం అంటున్నారు . . .

సద్గురు : పట్టెయ్య అనే పాత్రను (మాయను)
పాత్రధారి (దేవుడు) దాటగలడే గాని
పాత్ర యెప్పుడూ పాత్రదారిని దాటలేదు.
భూమ్మీద ఉండే ఎంత పెద్ద దేశమైనా
అది భూమి వైశాల్యాన్ని దాటలేదు.

30. అన్నాజీరావు : శ్రీరమణభగవానులు
ఆధ్యాత్మికంలో ఎవరెస్ట్ శిఖరానికి చేరుకున్నవారు.
కానీ క్రిందనున్న వాళ్లకి ఓ త్రాడు
పడేసి పైకి ఎక్కించాలి కదా!

సద్గురు : త్రాడు వేసి పైకి లాగాలనే ఉంది
భగవాన్‌కు.

కానీ అక్కడ (తనకు విడిగా) ఎవరూ
కనిపించలేదే!

31 సతీష్ : భగవంతుడు నన్ను ఎందుకింతగా
శిక్షిస్తున్నాడు?

సద్గురు : శిక్ష కాదు, శిక్షణ.

32. పట్టైయ్య : ప్రపంచం అంటే?

సద్గురు : తెలిసినవాడికి లేనిది.
తెలియనివాడికి ఉన్నది.

33. హరి : సాధన అవసరమా? కాదా?

సద్గురు : అవసరమై ఉన్నట్టు అనిపిస్తుంది.
కానీ అవసరం లేదు.

34. వరలక్ష్మి : గురువు గారూ!
నాకు మంచి మాటలు చెప్పండి . . .

సద్గురు : అన్నీ మంచి మాటలే.

వరలక్ష్మి : అలా కాదండి, నేను ఉపాసన
చేసుకోవడానికి గాను మంచిమాట
చెప్పమని అడుగుతున్నానండి.

సద్గురు : అయితే సరి. వినండి.
అందరూ 'ఒక్కడి'లో ఉన్నారు.
ఆ ఒక్కడే అందరిలో ఉన్నాడు.
అని సదా స్మరించుకోండి.

35. ప్రశ్న : మామూలు పౌర్ణమికి
గురుపౌర్ణమికి
తేడా ఏమి?

సద్గురు : మామూలు పౌర్ణమి మాసానికొకసారి వస్తుంది.
గురు పౌర్ణమి సదా ఉంటుంది.

36. ఒకరు : సదా దైవసన్నిధిలో గడపాలని కోరిక...

సద్గురు : మీ కోరిక గొప్పదే. కాని అనంతుడైన
దేవునికి 'సన్నిధి' ఎక్కడుంటుంది?

37. బాబు : తనకు ఓ గురువు ఉండి, మరో గురువు
ఇచ్చిన ఉపదేశాన్ని స్వీకరించవచ్చా?

సద్గురు : ఈశ్వరుడే దిగివచ్చి చెప్పినా సరే
స్వీకరించవద్దు.
నీ గురువాక్కే నీకు పరమ ప్రమాణం.

38. శైలజ : గురువుగారూ!
మీ ఆశీర్వాదం కావాలండీ...

సద్గురు : అది ఎప్పుడు లేదో చెప్పండి.

39. ప్రశ్న : శాస్త్ర ప్రయోజనం ఏమి?

సద్గురు : శాస్త్రం వలన పొందడం జరగదు.
పొందవవలసిన దానిని పొందిన తరువాత
శాస్త్రం రూఢి పరుస్తుంది.
అంతవరకే (శాస్త్ర) ప్రయోజనం.

40. చిలకమ్మ : ఒక్కొక్కరు ఒక్కొక్క సమస్యతో మీ వద్దకు వస్తుంటారు కదా! మీకు ఇబ్బందిగా అనిపించదా?

సద్గురు : ఎవరు ఎవరితో ఏమి మాట్లాడుకొన్నా సెల్‌ఫోన్‌కు వచ్చిన ఇబ్బందేమీ?

ఎవరు ఏమి నాకు చెప్పుకొన్నా
నాకొచ్చిన ఇబ్బందేమి?
వినేవాడు, సమస్య తీర్చేవాడు
వేరొకడుకున్నాడు నేను కాదు.

41. దొరబాబు : మా నాన్నగారు వొద్దన్నా వినకుండా,
ఆయన అనుమతి తీసుకోకుండా తమరి
దర్శనానికి వచ్చానండి....

సద్గురు : అలా ఎప్పుడూ చేయొద్దు నాయనా!
మీనాన్నగారి మాటను నీవు విననప్పుడు
నీ మాటను నేనెట్లా వింటానని అనుకుంటావు?
ఇక్కడ ఔషధం ఇస్తేనే రోగం తగ్గుతుంది.
అక్కడ ఔషధం లేకుండానే రోగం తగ్గుతుంది.
తండ్రిలో గురువును చూడడమే నీకు శ్రేయస్సు.

42. సుబ్బులు : శ్రీత్యాగరాజస్వామి 'నా జీవధార'
కీర్తను పాడి చచ్చినవాణ్ణి
బ్రతికించారు పుత్తూరు శివాలయంలో.

ఆయన శిష్యులంతా కలసి ఆ కీర్తనపాడి
త్యాగరాజస్వామిని బ్రతికించుకోలేకపోయారు.

సద్గురు : నిజమే.

త్యాగరాజస్వామి యొక్క రాముడు (శక్తి) వేరే.
శిష్యుల యొక్క రాముడు (శక్తి) వేరే.

43. చెంచురామయ్య : చూడండి స్వామీ....!
ఆ కొట్టువాడి మోసం...
రూపాయికి ఎంత కొద్ది కర్పూరం
ఇచ్చాడో...

సద్గురు : ఎంత కర్పూరం వెలిగించావో అన్నది ముఖ్యం కాదు. ఎంత ఖర్చు పెట్టావో అన్నది ముఖ్యం.
వాడు చేసింది వాడి ఖాతాలోకి పోతుంది.
నీవు చేసింది నీ ఖాతాలోకి వస్తుంది.

44. బాబు : ప్రాణానికి, చైతన్యానికి తేడా ఏమిటి?

సద్గురు : ప్రాణం లబ్-డబ్ అంటుంది.
చైతన్యం నేను - నేను అంటుంది.

45. సుబ్బు : ఆనందంగా ఉండాలంటే
ఏమి చేయాలి?

సద్గురు : ఏమీ చేయొద్దు.
నీవు ఏమి చేసినా సరే అది
నిశ్చలంగా ఉన్న నీటిలో రాయి వేయడమే.

46. పట్టెయ్య : గురువు గారూ!
మీతో కలిసి అరుణాచల ప్రదక్షిణం చేయాలని ఉంది.

సద్గురు : అరుణాచలమే నా చుట్టూ ప్రదక్షిణం చేస్తోంది.

47. కుమారస్వామి : గురువుగారూ!
నా స్నేహితుడు బత్తెయ్య చనిపోయాడు.

సద్గురు : మనం మాత్రం బ్రతికున్నామా
కుమారస్వామీ....

**48.** ప్రశ్న : సుఖి అంటే?

సద్గురు : సుఖదుఃఖములు రెండూ లేనివాడు.

**49.** వీరబాబు : గురువుగారూ!

అరుణాచల ప్రదక్షిణం చేయడానికి

పౌర్ణమి ఘడియలు ఎప్పుడున్నాయో చెబుతారా...

సద్గురు : నీ వెప్పుడు గిరిప్రదక్షిణ చేస్తావో అప్పుడే పౌర్ణమి.

**50.** విజయమ్మ : న కర్మణా న ప్రజయాధనేన త్యాగేనైక

అమృతత్వ మానశుః

అని శ్రుతి వాక్యం...

త్యాగం ఎట్లా చేయడం?

సద్గురు : నీదంటూ ఏదన్నా ఉన్నదా?

ముందు తేల్చు.

తర్వాత దానిని ఎట్లా త్యాగం చేయాలనేది

తర్వాత ఆలోచిద్దాం.

**51.** బాబు : జీవిత లక్ష్యమేమి?

సద్గురు : జీవించడమే.

**52.** బాబు : ఎవడు దేవుడు?

సద్గురు : ఎవనికి పాపము, తాపము, దైన్యము ఉండవో

వాడే దేవుడు.

53. పట్టెయ్య : అన్నింటిలో చైతన్యం ఉంది కదా!

సద్గురు : చైతన్యంలో అన్నీ ఉన్నాయి.

54. సద్గురు : 'జగత్తు అసత్యము' అన్నారు పెద్దలు.
ఆ విషయాన్ని ఎక్కడ ఉండి చెప్పారు?
ప్రపంచంలోనా? ప్రపంచానికి విడిగానా?

బాబు : ప్రపంచంలో ఉండే చెప్పారు.

సద్గురు : మరి వారు సత్యం చెప్పినట్టా?
అసత్యం చెప్పినట్టా?

బాబు : (మౌనం)

సద్గురు : పెన్ను, కాగితం దొంగిలించి,
ఆ పెన్నుతోనే, ఆ కాగితం పైనే
'దొంగతనం చేయరాదు' అన్ననీతి
సూత్రాన్ని వ్రాసినట్టు ఈ బోధలన్నీ.

55. ప్రశాంతి : దేవుడు అనుభవంలోకి వచ్చే
వరకు సాధన అవసరమే కదా!

సద్గురు : ఇప్పుడు నీ అనుభవంలో
ఉన్నదంతా దైవమే.
కాని దానిని నీవు ప్రపంచానుభవంగా
భ్రమపడుతున్నావు.

**56.** బాబు : జ్ఞాన సముపార్జన అంటే?

సద్గురు : జ్ఞానమును పోగొట్టుకొనుట.

**57.** అనసూయ : గురువుగారూ! ఏదైనా మంచిమాట చెప్పండి...

సద్గురు : మంచిది. వినండి.

దేవుణ్ణి తలవడం, కొలవడం మానండి.

అనసూయ : అయ్యో అలా అన్నారేమిటండీ!

సద్గురు : నిన్ను నీవే వెతుకుతావా?
నిన్ను నీవే తలుస్తావా?

నీకు నీవే ఉత్తరం వ్రాసుకుంటావా?
నీకు నీవే ఫోన్ చేసుకుంటావా?
నీవే దైవం.

కనుక నిన్ను నీవు తలవడం, కొలవడం
మానమని చెప్పాను. అంతే.

**58.** సద్గురు : బాబు బాబు కావడానికి
ఏ సాధన చేయాలి?

బాబు : ఏ సాధనా చెయనక్కర్లేదు.
బాబు బాబుగానే ఉన్నాడుకదా!

సద్గురు : నేను నేను కావడానికి
ఏ సాధన చేయాలి?

బాబు : ఏ సాధనా అక్కర్లేదు.
నేను నేనుగానే ఉన్నది కదా!

సద్గురు : మరి సమస్యేమిటి?

బాబు : (మౌనం)

59. బాబు : అమ్మను తలిస్తే అయ్యను తలచినట్లు కాదా?

సద్గురు : కాదు.
కానీ అయ్యను తలిస్తే అమ్మను తలచినట్లే.

బాబు : కుండను చూస్తే మట్టిని చూసినట్టు కాదా?

సద్గురు : కాదు.
మట్టే కుండగా ఉందన్న విషయం
ముందుగా నీకు తెలుసుంటేగాని
కుండను చూస్తే మట్టిని చూసినట్టు కాదు.
ముందు అయ్యను చూసుంటే గాని
అమ్మను చూస్తే అయ్యను చూసినట్టు కాదు.

60. బాబు : సాధన యొక్క ప్రయోజనమేమి?

సద్గురు : భగవంతుడు అవసరం లేని స్థితిని ప్రసాదిస్తుంది.

61. బాబు : ఆత్మ ప్రదక్షిణ అంటే?

సుద్గురు : అచలంగా ఉండడం.

**62.** ఒకరు : భగవంతునిలో సదా తల్లీనమై ఉండాలని కోరిక...

సద్గురు : భగవంతునిలో లీనం కావడానికి అసలు
నీవెప్పుడు ఆయనకు విడిగా ఉన్నావు?

**63.** ఒకరు : శవం ఎదుట పడితే అశుభమా?

సద్గురు : కానే కాదు.
బ్రతికున్నవాళ్ళు ఎదుటపడితేనే అశుభం.
చచ్చినవాళ్ల వలన ప్రమాదమేమీ ఉండదు.
బ్రతికున్న వాళ్ల విషయమై జాగ్రత్త
వహించండి చాలు.

**64.** ఒకరు : బల్లిపడే శాస్త్రం నిజమేనా?

సద్గురు : నిజమే. ఆ శాస్త్రం బల్లికే గాని మనకు కాదు.

**65.** ప్రశ్న : సమరసం అంటే?

సద్గురు : ఏడుపొస్తే నిండుగా ఏడ్వడం.
నవ్వొస్తే నిండుగా నవ్వడం.

**66.** సద్గురు : తాను కనే స్వప్న జగత్తు,
ఆ కలను కనే తన కంటే ఎక్కువ
వయసును కలిగి ఉండగలదా?

కృష్ణప్రసాద్ : ఉండదు.

సద్గురు : ఇప్పుడు నీవు కనే ఈజగత్తు వయస్సు కూడా
నీ వయస్సు కంటే ఎక్కువ ఉండదు.

67. ప్రశ్న : దివ్యదృష్టి అంటే?

సద్గురు : ఎవరికీ కనబడని దానిని తాను కనడంకాదు.
అందరికీ కనబడేదానిని తాను కనకపోవడం.

68. సద్గురు : హార్మోనియం వాయించే వ్రేళ్ళకు సంగీతం
తెలుసునా?

శైలజ : తెలియదు.

సద్గురు : వేదాంతం మాట్లాడేవాడికి కూడా
వేదాంతం తెలియదు.

69. శైలజ : గురువు గారూ! మీరు ఓ సారి
మా ఊరికి రావాలి...

సద్గురు : 'శైలజ' అనేది ఓ వాహనం.
'సుబ్రహ్మణ్యం' అనేది ఓ వాహనం
మీరు ఆహ్వానిస్తున్నది వాహనాన్నే.

కాదు నేను ఆహ్వానిస్తున్నది.
ఆ వాహనాన్ని నడిపే వాణ్ణి అంటారా?

ఇక్కడ నాలో ఉండి నన్ను నడిపేవాడే
అక్కడ నీలో ఉండి నిన్ను నడిపేవాడు కూడా.

ఇక్కడా 'నేను' ఉన్నాను.
అక్కడా 'నేను' ఉన్నాను.

రెండు విధాలా నేను మీ ఊరికి
రావల్సిన అవసరమూ లేదు,
అవకాశమూ లేదు.

70. వివేక్ : అన్నం కావాలంటే అమ్మను అడుగుతాం.
పైకం కావాలంటే అయ్యను అడుగుతాం.
నేనెవరో తెలియాలంటే ఎవర్ని అడగాలి?

సద్గురు : నిన్నే అడగాలి.

71. వర్మ : గురువుగారూ! వీరయ్య గురువుగారి
వస్తువొకటి (చేతికర్ర) మీ వద్దకు ఉన్నట్టు
నాకూ మీ వస్తువేదైనా ఒకటి నా వద్ద
ఉండాలని నా కోరిక...

సద్గురు : Already మీ వద్ద నా వస్తువొకటి ఉన్నది.
'వర్మ'యే ఆ వస్తువు.

72. ప్రశ్న : భగవంతుణ్ణి నమ్మినందుకు గుర్తేమి?

సద్గురు : భగవంతుణ్ణి ఏమి కోరకపోవడమే.

73. ప్రశ్న : యోగం అంటే?

సద్గురు : ఏకవస్తువుగా తన్నెటిగి ఆనందించుట.

74. ప్రశ్న : పరమాత్మ ఎలా ఉంటుంది?

సద్గురు : నిస్తరంగ జలధి వలె.

75. ప్రశ్న : అంతరాత్మ ఎలా ఉంటుంది?

సద్గురు : నివాత దీప కళిక వలె.

76. మునెయ్య : అందరూ రమణమహర్షుల్లా అయిపోతే లోకం జరిగేదెట్లా?

సద్గురు : అందరి సంగతి వదిలేయ్!
ముందు నువ్వు అవ్వు చూద్దాం.

77. ప్రశ్న : జీవితమంటే?

సద్గురు : తత్కాలికంగా తనతో తనకున్న ఎడబాటు శాశ్వతం కావడం.

తాత్కాలికంగా తనతో తనకున్న కలయిక శాశ్వతం కావడం.

78. పట్టెయ్య : గురువు గారూ! స్వస్తి వచనం ప్రసాదించండి.

సద్గురు : నేనున్నచోట నీవుంటావు.
నీవున్నచోట నేనుంటాను.

79. ప్రశ్న : ఎవడు నమస్కార యోగ్యుడు?

సద్గురు : 'నాకు బాధలు లేవు' అని ఎవడైనా అంటే వాడే నమస్కార యోగ్యుడు.

**80.** ప్రశ్న : దేవుడెక్కడ ఉన్నాడు?

సద్గురు : నీలోనే ఉన్నాడు.
నీవుగానే ఉన్నాడు.

**81.** ప్రశ్న : సన్యాసి ధనరూపేణ 'దక్షిణ'ను స్వీకరించవచ్చా?

సద్గురు : స్వీకరించవచ్చు. కానీ చీకటి పడేలోపు ఆ ధనాన్ని అంతటినీ పూర్తిగా ఖర్చు చేసేయాలి. అప్పుడు మాత్రమే ఆ దక్షిణ వలన దోషం అంటదు.

**82.** డాక్టర్ మురుగేశన్ : స్వామీ! నా ప్రాక్టీసు బాగా జరిగేటట్లు ఆశీర్వదించండి.

సద్గురు : అంటే లోకంలో రోగులు పెరగాలనా నీ ఉద్దేశం?
ఈ విధమైన ప్రార్థన సరిగాదు.
రోగి రోగం ఉండి నీ వద్దకు రాడు.
నిన్ను అనుగ్రహించడానికి గాను
భగవంతుడే రోగి రూపంలో వస్తాడని
ఎఱుక కలిగి రోగికి వైద్యం చేయి.

**83.** మురుగానంద : స్వామీ! బ్రహ్మానుభూతిని పొందడం ఎలా?

సద్గురు : 'నేను బ్రహ్మమును' అని అనుకుంటూ ఉండు.

మురుగానంద : అనుకుంటే సరిపోతుందా?

సద్గురు : సరిపోతుంది.
అనుకోవడం – అనుభూతి.
రెండూ ఒకటే ఆధ్యాత్మికంలో.

**84.** పట్టెయ్య : మనిషి యొక్క ఆయుః ప్రమాణం వందేళ్ళు అన్నది వేదం....

సద్గురు : అది జగత్తు యొక్క ఆయుఃప్రమాణం. వందేళ్ళకు మించి జగత్తు నీ యెదుట ఉండదు.

**85.** ప్రశ్న : పతివ్రత అంటే?

సద్గురు : భక్తుడు భగవదానుభవాన్ని పొందటానికి విగ్రహాన్ని ఆలంబనగా చేసుకుని వ్రతం ఆచరించినట్లు భగవదానుభవాన్ని పొందటానికి తన పతినే ఆలంబనగా చేసుకుని వ్రతం చేసే స్త్రీని పతివ్రత అంటారు.

**86.** బాబు : భగవాన్ 'నేను' అనేది భగవంతుని మొట్టమొదటి నామమనీ, 'ఓం'కారము కూడా ద్వితీయమేననీ సెలవిచ్చారు. ఆ 'నేనే' భగవంతుడని కూడా అన్నారు. కానీ మనం నేను అని పలికేటప్పుడు ఆ భగవదనుభూతి కలగడం లేదు. ఎందువలన?

సద్గురు : అప్పుడే ఆవు పొదుగు నుండి పిదికిన పాలు వెచ్చగా మధురంగా ఉంటాయి. రమణులు చెప్పిన ఆ 'నేను' అట్టిది. అది అనేది కాదు, అనబడేదీ కాదు. అది ప్రతి జీవిలోని స్వయం స్ఫురణ.

మనం పలికే నేను నీళ్లపాల వంటిది. పాలలో కలిసిన నీరు ఆ పాల రుచిని చెరుస్తుంది. మనం పలికే నేను నామరూప సహితమైన నీటిని పోలిన జీవభావంతో కలిసి ఆ స్వయం స్ఫురణ జీవస్ఫురణగా రూపొందినందువలన మనకు భగవదనుభవ రూపమైన సుఖానుభవం కలుగదు.

87. ప్రశ్న : నేనెవడను?

సద్గురు : ఎవడు నేనుగా ఉన్నాడో
వాడే నేను.

88. ఒకరు : ఇల్లు ఈశాన్యం వైపు తిరిగి ఉంటే మంచిదని వాస్తు చెబుతోంది....

సద్గురు : బుద్ధి ఈశాన్యం (అధిపతి ఈశ్వరుడు) వైపుకు తిరిగి ఉంటే మంచిది.

89. ప్రశ్న : స్వర్గ నరకాలంటే ఏమి?

సద్గురు : జీవితం అభినయంగా ఉంటే స్వర్గం.
అనుభవంగా ఉంటే నరకం.

90. సద్గురు : నీకిప్పుడు అగుపడుతున్నది
దేవుడా? ప్రపంచమా?

బాబు : ప్రపంచమే.

సద్గురు : అయితే నీవు దేవుడవే.
దేవునికే ప్రపంచం అగుపడేది.
ప్రపంచానికే దేవుడు అగుపడేది.

91. ఒకరు : ఓ మంచి ఆధ్యాత్మిక సాధన
ఏదయినా ఉంటే చెప్పండి....

సద్గురు : ఎప్పుడూ ఎక్కడా
నీ సంతకం చేయొద్దు.

92. సద్గురు : కలలోని వాడికి తనువూ ఉంది,
జగత్తూ ఉంది.
మరికలను కనేవాడికి....?

బాబు : అనుభవంలో లేదు కాబట్టి
తనువూ లేదు, జగత్తూలేదు.

సద్గురు : సరిగ్గా చెప్పావు.
“అసలు దేవుడి”కి
తనువూ లేదు జగత్తూ లేదు.
‘మనం కొలిచే దేవుడి’కి
తనువూ ఉంది.
జగత్తూ ఉంది.
మొదటి దేవుడు మనిషిని చేసిన దేవుడు.
రెండవ దేవుడు మనిషి చేసిన దేవుడు.
మొదటి దేవుని పేరు ‘నేను’
రెండవ దేవునికి పేర్లు అనేకం.

93. బాబు : శ్రీ రమణాశ్రమంలో పాశ్చాత్య భక్తుల నడవడికలను చూస్తుంటే, మనకల్చర్‌ను వాళ్లే బాగా కాపాడుతున్నట్లు అనిపిస్తుంది.

సద్గురు : అవునవును. వాళ్ళ కల్చర్‌ను మనం కాపాడుతున్నాం కదా!

94. బాబు : గురువుగారు పరమరహస్యము అని చెప్పినా సరే అష్టాక్షరీ మంత్రాన్ని శ్రీరంగ గోపురమెక్కి వెలుగెత్తి చాటిన మహనీయుడు రామానుజుడు....
గురువుకంటే శిష్యుడే గొప్ప కాదా?

సద్గురు : నిజమే, కానీ అలా బహిరంగంగా విన్నవారిలో ఎంతమంది రామానుజడిలా ప్రవక్తలయినారు?

బాబు : అలా ఎవరూ కాలేదు.

సద్గురు : కాబట్టి ఆ గురువే గొప్ప.
తన జీవితంలో ఒకే ఒక్కడికి రహస్యంగా మంత్రోపదేశం చేశారు.
ఆ ఒక్కడు లోక పూజ్యుడైనాడు.

95. సద్గురు : అరణ్యంలో క్రూర జంతువులూ ఉంటాయి, సాధుజంతువులూ ఉంటాయి.
ఇంతకీ అరణ్యం అనేది క్రూరత్వానికి సంబంధించినదా? సాధుత్వానికి సంబంధించినదా?

బాబు : దేనికీ సంబంధించినది కాదు.
కానీ రెంటికీ అవకాశంగా ఉంటుంది.

సద్గురు : అదేవిధంగా నీవు దేనికీ అంటక
సకలానికి 'అవకాశం'గా ఉండు.

96. ప్రశ్న : సర్వజ్ఞుడు అంటే?

సద్గురు : 'సర్వము' లేనివాడు.

97. బాబు : పాల్ బ్రంటన్ భగవాన్‌తో అన్నారట –
"మీకూ నాకూ మధ్య ఏదో తేడా ఉన్నది. అది ఏమిటన్నది అర్థం కావడం లేదు" అని.

సద్గురు : ఓ చంటి బిడ్డను కలిగిన తల్లి యాచిస్తోంది.
ఓ చంటి బిడ్డను కలిగిన తల్లి దానం చేస్తోంది.

తల్లుల విషయంలో చూస్తే –
ఒక తల్లి యాచకురాలు.
మరొక తల్లి దాత.
అనే తేడాలున్నాయి.
మరి చంటిబిడ్డల విషయంలో చూస్తే
వారిని ఏమనగలం?

బాబు : వారు ఏమీ కారు.
వారిలో ఏ తేడాలూ ఉండవు.

సద్గురు : బ్రంటన్ దృష్టి తల్లుల వైపు నుంచి ఉన్న దృష్టి. అందుకే తేడా ఉన్నట్టు అనిపించింది. రమణుల దృష్టి చంటిబిడ్డల వైపు నుంచి ఉన్న దృష్టి. అందుకే రమణులు ఏ తేడాలు లేక ఏకాత్మ స్వరూపులుగా వెలిగారు.

**98.** వరలక్ష్మి : స్వామీ...! మా గురువుగారికి సదా సేవ చేసుకుంటూ వారి ఆశ్రమంలోనే శాశ్వతంగా ఉండిపోవాలని నా కోరిక...

సద్గురు : నీవు ఎవరికి సేవ చేసినా, ఏ సాధన చేసినా నీ భర్త అనుమతి లేనిదే నీవు పొందాలనుకున్నదానిని నీవు పొందలేవు. ఆ పరతత్త్వమే నీ భర్తరూపంలో నీతో కాపురం చేస్తోంది అని గ్రహించు. నిజానికి నీ రూపంతో ఉన్నది కూడా ఆ పరతత్త్వమే. సత్యాన్వేషణలో తొలి అడుగు, చివరి అడుగు నీవే.

నీ కుటుంబాన్ని వదలి ఎక్కడికీ వెళ్లవలసిన అవసరం లేదు.

నీ భర్త నీడలో నీవు గడపడమే మోక్షకారకం.

**99.** ప్రశ్న : స్థిమితం అంటే?

సద్గురు : చాలడం – మితం.

చాలకపోవడం – పరిమితం.

చాలా ఉండడం – అపరిమితం.

వీటితో నిమిత్తం లేకుండ ఉండడం స్థిమితం.

100. ప్రశ్న : మోక్షమంటే

సద్గురు : అన్ని ప్రయత్నాల నుండి విరమించుకోవడం.

101. ప్రశ్న : 'నేను' ను

నేను – నాది అని రెండుగా వేఱు చేసి

చూపించేది ఏదో అదే మాయ.

102. ప్రశ్న : ఏకాంతం అంటే?

సద్గురు : తనకు అందరూ ఉన్నా

తాను అందరిలో ఉన్నా

తానెప్పుడూ ఒంటరియే

అని గ్రహించడమే ఏకాంతం.

103. కాయంపేట స్వామి : మీరు అంతదూరం నుండి ఇక్కడకు

ఎందుకొస్తున్నారు?

సద్గురు : స్వామిని చూడడానికి...

కాయంపేట స్వామి :ఇక్కడకు వచ్చి చూస్తేనే కనబడే స్వామి అయితే

ఇట్లాంటి ఈ స్వామిని చూడవలసిన అవసరమే లేదు.

నిజంగా స్వామి నువ్వనుకున్నంత గొప్పవాడే అయితే

నీవున్న చోటనే ఈ స్వామిని చూడవచ్చునే! రెండు

విధాలా మీరు ఇక్కడకు రావలసిన అవసరమే లేదు.

104. పట్టెయ్య : గురువుగారూ! వచ్చే మాసం

మేము కాశీవెళుతున్నాము....

సద్గురు : ఉన్నదంతా కాశీయే.
కాకపోతే మీరు దక్షిణం నుండి ఉత్తరానికి వెళుతున్నారు. అంతే. బిడ్డ తన తల్లి ఒడిలో కూర్చున్నా, చంకలో ఉన్నా, వీపు మీద ఎక్కినా ఉండేది తల్లి మీదే కదా!

**105.** చిలకమ్మ : గురువుగారూ!
ఈలోకంలో ఎవర్ని నమ్మాలో,
నమ్మకూడదో తెలియడం లేదండి...

సద్గురు : ముందు నీవు చిలకమ్మను నమ్మొద్దు.

**106.** బాబు : మాయ నిత్యమైనదా? అనిత్యమైనదా?

సద్గురు : 'ప్రపంచంలో నేను' అన్న వర్గదృష్టిలో
మాయ నిత్యము.

'నాలో ప్రపంచం' అన్న వ్యక్తిగతంలో
మాయ అనిత్యము.

**107.** బాబు : ఆధ్యాత్మిక ప్రబోధాలు చేసే ఆశ్రమం గొప్పదా? సంప్రదాయాలపేరుతో ఉత్సవాలను నిర్వహించే దేవాలయం గొప్పదా?

సద్గురు : ఆధ్యాత్మికం అనేది కూడా సంప్రదాయమే.
సంప్రదాయం అనేది కూడా ఆధ్యాత్మికమే.

108. ప్రశ్న : అరుణగిరి ప్రదక్షిణం యొక్క ఫలమేమి?

సద్గురు : ఇప్పటి వరకు ఎవరూ అరుణగిరి ప్రదక్షిణం చేసిందిలేదు అని మనసుకు తోయడమే గిరిప్రదక్షిణ ఫలం.

109. ప్రశ్న : ఈ సృష్టి యెలా జరిగింది?

సద్గురు : అచల స్వరూపుడైన పరమాత్మునిలో స్వాభావికంగా ఉన్న సంకల్ప వైభవమే ఈ మహాసృష్టి.

110. ప్రశ్న : గురు చరిత్ర పారాయణం వలన ప్రయోజనం ఏమి?

సద్గురు : పారాయణం చేయగా చేయగా

1. గురువుకు చరిత్రే లేదని తెలుస్తుంది.
2. సకలమూ గురు చరిత్రే అని తెలుస్తుంది.

111. ఒకరు : కామికానివాడు మోక్షగామికాడు
అన్నారు వేమన....

సద్గురు : దాని అర్థం మోక్షాన్ని పొందాలంటే ముందుగా కాముకులుగా ఉండాలనేది ఆయన భావం కాదు. కామికాకపోతే మోక్షాన్ని కూడా కామించడు అని అర్థం.

112. ప్రశ్న : ఏది దైవ సన్నిధి?

సద్గురు : కావాలి - వద్దు అనేవి ఏ చోటులో ఉండవో అదే దైవసన్నిధి.

113. ప్రశ్న : దైవానుగ్రహాన్ని పొందినందుకు గుర్తేమి?

సద్గురు : దేనికీ చలించకుండా ఉండే శక్తి మనసుకు కలగడమే.

114. ప్రశ్న : సాక్షాత్కారం అంటే?

సద్గురు : నిర్భయత్వం.

115. ఒకరు : ధ్యానంలో నా మనసు ఎక్కడెక్కడో తిరుగుతుంటుంది స్వామీ....!

సద్గురు : తిరగనీ...
ఆత్మ, అనంతము, సర్వవ్యాపకము కదా!
మనసు ఎక్కడెక్కడ తిరిగిన అంతా ఆత్మలోనే కదా!
తిరగనీ...

116. ప్రశ్న : సహజ సమాధి అంటే?
అంతా సహజంగా ఉంది అని ఉండడం.

117. ప్రశ్న : మహామాయ అంటే?

సద్గురు : కారణం వేఱు, కార్యం వేఱు.
ఈ రెంటిని కలిపి చూపించేది ఏదో అదే మాయ.

118. ప్రశ్న : ఏది సత్యము?

సద్గురు : సత్యమే సత్యము.

**119.** బాబు : దేవుడున్నాడని నమ్ముతాను.కాని ఆయన జగత్తు నడిపించే విషయంలో ఓ క్రమత్వం ఉన్నట్లు కనబడదు....

శ్రీ సద్గురు : ఇది క్రమము, ఇది అక్రమము అని నీవెట్లా నిర్ణయిస్తావు?
నీకు పరిస్థితులు అనుకూలంగా ఉంటే అంతా క్రమంగా ఉందని, ప్రతికూలంగా ఉంటే క్రమం లేదని వాదిస్తావు. అంతేనా?
క్రమం ఉంది...అయితే నీ అభిప్రాయంతో
నీ అనుభవంతో దానిని సరి చూడవద్దు.
తెలియని వాడు కంప్యూటర్‌ని విప్పి చూస్తే అంతా గందరగోళంగా కనిపిస్తుంది.
తెలిసినవాడు చూస్తే అందులో ఓ క్రమం కనిపిస్తుంది. ఇదీ అంతే...

**120.** సద్గురు : 'భూమి' గాని లేదా 'సూర్యుడు' గాని లేదా నీవు పీలుస్తున్న 'గాలి' గాని ఈ రోజంతటిలో ఒక్కసారైనా గుర్తుకొచ్చిందా?

బాబు : లేదండి...

సద్గురు : గుర్తులో లేకపోయినా అవి నీకు
'టచ్'లో లేకుండా ఉన్నాయా?

బాబు : టచ్‌లోనే ఉన్నాయండి...

సద్గురు : దేవుని విషయం కూడా అంతే.
నీవు తలిచినా తలవకపోయినా దేవుడు సదా నీకు టచ్‌లోనే ఉంటాడు. ఎంతగా టచ్‌లో ఉన్నాడంటే దానితో పోలిస్తే నీకు నీవు కూడా దూరమే.

121. ప్రశ్న : ముక్తి ఎలా కలుగుతుంది?

సద్గురు : మహా ఆశ్చర్యంలో నుంచి కలగొచ్చు.
మహాభయంలో నుంచి కలగొచ్చు.
మహా దుఃఖంలో నుంచి కలగొచ్చు.

122. బాబు : ప్రతి ఒక్కడు తానే గొప్పని భావిస్తుంటాడు...

సద్గురు : నిజమే.
ప్రతి ఒక్కడూ గొప్పవాడే.
ప్రతి ఒక్కడూ ఆత్మస్వరూపుడే.

123. ప్రశ్న : అర్థానికి, పరమార్థానికి తేడా ఏమి?

సద్గురు : అర్థము - పదమున్నంత వఱకే ఉంటుంది.
పరమార్థము-పదము పుట్టక ముందు ఉండినది.
పదము ఉన్నప్పుడూ ఉంటుంది.
పదము లేకపోయినా ఉంటుంది.

124. ప్రశ్న : దేవుడంటే?

సద్గురు : దేవుడే.

125. బాబు : మహనీయుల చరిత్రలను
పారాయణం చేయడం వలన
ముఖ్య ప్రయోజనమేమి?

శ్రీసద్గురు : 'ఏ చేయి అయితే
ఆ మహనీయులను సృష్టించిందో
ఆ చేయే నన్నూ సృష్టించింది'.
అన్న జ్ఞానం కలుగుతుంది.

126. సద్గురు : ఏం పుస్తకం చదువుతున్నావు?

బాబు : బాబా చరిత్ర...

సద్గురు : చదువబడేదానికంటే – చదివే వాడే ముఖ్యం అన్న
విషయాన్ని జ్ఞప్తిలో ఉంచుకుని చదువు.

127. ప్రశ్న : ఎవడు ముక్తుడు?

సద్గురు : అందరూ ముక్తులే అని ఉన్నవాడు ముక్తుడు.

128. ప్రశ్న : సృష్టి ఆది నుండి ఇప్పటి వఱకు
ఈ భూమ్మీద అవతరించిన మహనీయులందరూ
ఇప్పుడెక్కడున్నారు?

సద్గురు : నీ గురురూపంలోనే ఉన్నారు.

129. సద్గురు : లోకంలో తన నామం - రూపం ఉన్నంతవరకు ముక్తి కలుగదు.

బాబు : లోకంలో గతించిన మహనీయులెందరో ఉన్నారు కదా! వారి రూపాలు లేక పోయినా వారి కీర్తి ఉన్నది కదా! మరి వారికి ముక్తి కలుగనట్లేనా?

సద్గురు : అవును. లోకంలో తన రూపు-పేరు లేనివారే ముక్తులు.

130. బాబు : ఉగాది సందర్భంగా పట్టెయ్యగారు మీ నుండి సందేశం కోరుతున్నారు...

సద్గురు : తన లోపల ఉండి చెప్పే స్వామి సందేశాల్ని వినమని చెప్పండి.

బయట ఉండే స్వాములు ఎంత గొప్ప వారైనా వారిచ్చే సందేశాలు పనికిరావని తెలుసుకోమనండి.

131. ఒకరు : గురువుగారూ!

భగవంతుడు ఎందుకు ఈ జగత్తును సృష్టించాడు?

సద్గురు : మంచి ప్రశ్న.

కానీ ఈ ప్రశ్నను అడగవల్సింది నన్ను కాదు, భగవంతుణ్ణి.

132. ఒకరు : స్వామీ! నేను ఎన్ని పూజలు, పుణ్యాలు చేసినా దైవానుగ్రహం కలుగడం లేదు...

సద్గురు : పెట్ట గ్రుడ్డు పెట్టగానే అందులో నుంచి
పిల్ల రావాలంటే ఎలా?
భూమిలో విత్తు నాటగానే అందులో నుంచి
చెట్టురావాలంటే ఎలా?
దేవుణ్ణి మ్రొక్కగానే నీకోరిక తీరాలంటే ఎలా?
ప్రేమతో ఎదురు చూడు...

**133.** బాబు : పట్టెయ్యగారు 'గురుస్తోత్రం' ఒకటి వ్రాసిమ్మని
అడిగారు నన్ను.

సద్గురు : గు - రు
అన్న రెండక్షరాల కన్నా గొప్ప స్తోత్రం
ఇంకేముంటుంది?

**134.** ప్రశ్న : జ్ఞానానికి, విజ్ఞానానికి తేడా ఏమి?

సద్గురు : తాను తెలుసుకునేది - విజ్ఞానం.
తనను తెలుసుకునేది - జ్ఞానం.

**135.** ప్రశ్న : దైవసాక్షాత్కారమంటే?

సద్గురు : జగద్రూపంగా ఉన్నది దైవమే
అని తెలిసి ఉండడమే దైవసాక్షాత్కారం.

**136.** ప్రశ్న : జీవన్ముక్తి అంటే?

సద్గురు : జీవితరూపంగా ఉన్నది దైవమే
అని తెలిసి జీవించడమే జీవన్ముక్తి.

**137.** మురుగానంద : నా ఆరోగ్యం ఏమీ బాగుండడం లేదు స్వామి! స్వస్థత పొందడానికి ఏదైనా మార్గం చెప్పండి...

సద్గురు : ప్రతిరోజూ రాత్రి నిద్రపోయే ముందు అమృత సరోవరంలో మునిగి లేస్తున్నట్లు ఊహిస్తూ నిద్రలోకి జారుకోండి. తిరిగి మెలకువ రాగానే మళ్లీ ఆ అమృత సరోవరంలో మునిగిలేస్తున్నట్లు ఊహచేస్తూ పడక మీద నుంచి లేవండి... ఇలా ప్రతి రోజూ చేస్తున్నట్లయితే నీకు మంచి ఆరోగ్యం చేకూరుతుంది.

**138.** సుబ్బరాయుడు : ఉన్నది ఆత్మ ఒక్కటే అని గ్రహించేశాను, కానీ దుఃఖం తొలగలేదెందుకు?

సద్గురు : నీవు నిజంగా గ్రహించలేదనే దానికి అర్థం. గ్రహించినందుకు గుర్తు దుఃఖం తొలగడమే.

**139.** బాబు : గురువుగారి జీవిత చరిత్ర వ్రాస్తే బాగుండునని గోపాలకృష్ణగారు నాతో అన్నారు...

సద్గురు : గురువుకు చరిత్ర ఉండదు.
చరిత్ర ఉన్నవాడు గురువుకాదు.
ఇన్ని జీవిత చరిత్రలు ఉండడం వల్లనే
ఇంతమంది 'గురువులు' ఏర్పడ్డారు.
లేకపోతే ఒకే గురువు ఉండేవాడు.

**140.** దొరబాబు : వ్యావహారిక సత్యం, ఆధ్యాత్మిక సత్యం అంటే ఏమిటి?

సద్గురు : నీవు ఏలేశ్వరంలో దొరబాబుగా
నేను శ్రీకాళహస్తిలో సుబ్రహ్మణ్యంగా
ఉన్నామనేది వ్యావహారిక సత్యం.
మనమిద్దరం ఒకే చోటులో, ఒకరుగానే
ఉన్నామనేది పారమార్థిక సత్యం.

**141.** మధు : దేవుడు యూస్‌లెస్‌ఫెలో...

సద్గురు : నిజమే.
దేవుడు అనంతుడు.

అతడుయూస్ కావడానికి
'ఇతరం' ఎక్కడిది?

'దేవుడు యూసెలెస్‌ఫెలో' అన్నది
సత్యమే.

**142.** పట్టెయ్య : స్వామీ! క్రమ ముక్తి-సహజముక్తి అంటే ఏమి?

సద్గురు : తాను లేకుండా పోవడమే ముక్తి.
ఒకడు క్రమంగా లేకుండా పోతాడు.
అది క్రమ ముక్తి.

మరొకడు హఠాత్తుగా లేకుండా పోతాడు.

ఇది సహజముక్తి.

ఈ రెంటిలో తానులేకుండా పోవడం

అనేదే ప్రధానం.

143. వర్మ : మిమ్మల్ని నాన్న గారూ! అని
సంబోధించవచ్చా?

సద్గురు : బంగారుగా...

వర్మ : నాన్నగారూ! మిమ్మల్ని ఏదైనా అడగవచ్చా?

సద్గురు : ఎప్పుడూ,ఎవరినీ, ఏమీ అడగని స్థితిని
నాకు ప్రసాదించమని అడగండి.

144. బాబు : కర్మముందా? జన్మముందా?

సద్గురు : నీవు ముందు దేనిని చూస్తే
అదే ముందు.

145. సుబ్బరాయుడు: దేశం ఇంత
అల్లకల్లోలంగా ఉందేమి?

సద్గురు : ముందు నీవు మేలుకో.

146. ఒకరు : భగవంతుడు చిక్కడు – దొరకడు
అన్నారు తమరు...

సద్గురు : ఎందుకంటే 'నేనే' భగవంతుడు కాబట్టి.

147. పట్టెయ్య : 'సరాసరి' థియరీ రమణులు లాంటి అవధూతలకు
కూడా చెల్లుతుందా?

సద్గురు : ఇతరుల విషయంలో –
బాహ్యంగా తేడాలు ఉన్నప్పటికీ
అనుభవంలో సరాసరియే ఉంటుంది.

కానీ మహనీయుల విషయంలో –
బాహ్యంలో సరాసరి లెక్కలోనే కనిపిస్తూ,
అనుభవంలో మాత్రం ఏ లెక్కకూ అంటని
స్థితిలో ఉంటారు.

148. బాబు : "నా భక్తులైనవారు నిత్య దరిద్రులైపోతారు"
అన్న బ్రహ్మంగారి మాటలో
అంతరార్థమేమి?

సద్గురు : 'నాది' లేనివాడు దరిద్రుడు.
'నాది–నేను' రెండు లేనివాడు
నిత్యదరిద్రుడు

(ఈ నిత్య దారిద్ర్యమే నిజమైన సంపన్నత్వం)

149. బాబు : జగత్తు నా మనస్సృష్టే అంటున్నారు కదా!
ఇచ్ఛా శక్తి నాకెందుకు లేదు?

సద్గురు : స్వీయ దర్శకత్వంలో నీవు నటిస్తున్నప్పుడు
నీకున్న ఇచ్ఛాశక్తి రంగస్థలంపై ఎలా ఉంటుంది?

150.రుక్మాంగద : జగత్తులోని పాపమంతా కలిపితే అది భగవంతునికి ఓ చిన్న పుట్టు మచ్చలా ఉంటుంది...

సద్గురు : సూర్యుడిలో పుట్టు మచ్చంత చీకటి ఉండడానికి వీలున్నదా?

భగవంతునికి జగత్తే లేదు.

ఇక జగత్తులోని పాపాన్ని ఆయనకు

పుట్టుమచ్చఅనడం సరికాదు.

151. బాబు : దేవుడే, గురువే ప్రధాన ఆటంకాలు అన్నాడు కృష్ణ...

సద్గురు : కాదు కాదు.

కృష్ణకు కృష్ణయే ప్రధాన ఆటంకం.

152. వర్మ : ఎక్కడైనా అన్యాయం

జరుగుతుంటే సహించలేను.

రియాక్ట్ అవుతుంటాను.

సద్గురు : డస్ట్ అలెర్జీ లాగా ఇదొక అలెర్జీ అంతే.

153. కిరణ్ : ఈ చరాచర విశ్వమంతా తమ రూపమేనని ఎవరైతే నిరూపణ ఇవ్వగలరో వారే నిజమైన సద్గురువు.

సద్గురు : ఈ చరాచర విశ్వమంతా తన రూపమేనని ఎవడైతే సద్గురువు రూపంలో నిరూపణ ఇస్తున్నాడో వాడే భగవంతుడు.

**154.** బాబు : ఉన్నది ఆత్మ ఒక్కటే

సద్గురు : ఒకే వస్తువుకున్న మూడు పేర్లవి -

**1.** ఉన్నది **2.**ఆత్మ **3.** ఒకటి

**155.** బాబు : మృత్యుంజయ మంత్రాన్ని ఉపాసించడం వలన మృత్యువు తొలగుతుందా?

సద్గురు : మృత్యుభయం తొలగుతుంది.

**156.** మురుగానంద : స్వామీ! జ్ఞానమార్గమేదోతెలియడం లేదు.

సద్గురు : నీవు పుట్టినప్పటి నుండి ఇప్పటి వఱకు నడచినదంతా జ్ఞానమార్గమే.

ఉన్నది అదొక్కటే మార్గం.

రెండవది లేదు.

**157.** సద్గురు : కావ్యకంఠులు రమణమహర్షికి ఆ పేరు పెట్టక మునుపు ఉన్న పేరేమి?

బాబు : బ్రాహ్మణ స్వామి...

సద్గురు : అంతకు మునుపు?....

బాబు : వేంకటరామన్...

సద్గురు : అంతకు మునుపు?

బాబు : తెలియదు...

సద్గురు : తెలియకపోయినంతమాత్రాన అప్పుడు భగవాన్ లేడా?...

బాబు : ఉన్నాడు...

సద్గురు : ఆ “ఉండడం” అనేదే ఆయనకు నామం, రూపం, ఉనికి, జ్ఞానం, ఆనందం...

158. బాబు : జన్మ సార్థకం అవ్వాలంటే ఏమి చేయాలి?

సద్గురు : ఏమీ చేయొద్దు.
జన్మ ఎత్తేక సార్థక్యాన్ని సాధించడం కాదు,
సార్థకం అయ్యాకే జన్మ ఎత్తడం జరుగుతుంది.

159. సద్గురు : జ్ఞానం అంటే తెలియబడేదా?
తెలుసుకునేదా?

బాబు : తెలుసుకునేది...

సద్గురు : జ్ఞాని తెలియబడేవాడా?
తెలుసుకునేవాడా?

బాబు : తెలుసుకునేవాడు...

సద్గురు : మరి జ్ఞాని ఎవరు? రమణుడా? నీవా?

160. సతీష్ : సర్వశక్తులూ కలిగి ఏ శక్తులూ లేనట్లుంటారు కొందరు మహనీయులు...

సద్గురు : అలా ఉండడం అనేది కూడా ఒక శక్తే.

**161.** మురుగానంద : స్వామీ! నేను తీర్థయాత్రకు వెళుతున్నాను...

సద్గురు : ఏ యాత్రయినా సరే ఒక కలలో నుంచి మరొక కలలోకి వెళ్లడం లాంటిదే.

**162.** ఒకరు : రామజన్మ భూమి అయోధ్యే కదండీ...?

సద్గురు : రాముడు పుట్టక మునుపు నుంచే
'రామ'శబ్దం ఉన్నది.
'రామ' అనేది ఆత్మకు పర్యాయ పదం. అనంతమైన ఆత్మకు జన్మభూమి ఎక్కడిది? ఆ 'రామ' అన్న శబ్దాన్నే దశరథుడు తన కుమారుడికి పేరుగా పెట్టుకున్నాడు.

**163.** ఒకరు : ఏ సమస్య వచ్చినా మీరింత నిశ్చింతగా ఎలా ఉండగలుగుతున్నారు?

సద్గురు : సుఖమొచ్చినా, దుఃఖమొచ్చినా అదీ కొద్దికాలమే, ఇదీ కొద్దికాలమే అని ఉంటాను.
అందుకే ఈ నిశ్చింత.

**164.** అనసూయ : గురువుగారూ! ప్రారబ్ధం అంటే ఏమి?

సద్గురు : ప్రారబ్ధాన్ని గురించి ప్రశ్నించడమే ప్రారబ్ధం.

**165.** ఒకరు : దేవుడు ఈ సృష్టి ఎందుకు చేశాడు?

సద్గురు : అలా అని దేవుడొచ్చి నీకు చెప్పాడా?
నిద్రలో సృష్టీ లేదు, ప్రశ్నా లేదు.
మెలకువతో పాటు మనస్సూ, మనస్సుతో పాటు జగత్తూ లేస్తోంది. కాబట్టి ఈ సృష్టి కేవలం నీలోనిదే, నీవే.

166. మురుగానంద : స్వామీ! మీరు సదా నా వెన్నంటే ఉండి నన్ను రక్షించండి.

సద్గురు : నా వెన్నంటే ఉండి నన్ను రక్షిస్తున్నవాడే నిన్నూ, సకలాన్నీ రక్షిస్తున్నాడు.

167. పట్టెయ్య : సాధన అవసరమా?

సద్గురు : నిద్రపోవడానికి ఏ సాధన చేస్తున్నావు?
కల కనడానికి ఏ సాధన చేస్తున్నావు?
మేలుకోవడానికి ఏ సాధన చేస్తున్నావు?

పట్టెయ్య : ఏ సాధనా అవసరం లేకనే వాటికవే సహజంగా జరిగిపోతుంటాయి స్వామీ...

సద్గురు : ఇదీ అంతే.
పుట్టుక - జీవితం - మరణం - అనేవి
ఏ సాధనా చేయకనే తటస్థపడుతాయి.
బంధం - దుఃఖం - మోక్షం - అనేవి కూడా
సాధనతో నిమిత్తం లేకుండానే కలుగుతాయి.

168. పట్టెయ్య : సనాతన ధర్మాన్ని అనుసరించేవాడు
పునర్జన్మ సిద్ధాంతాన్ని అంగీకరించినవాడా?

సద్గురు : అసలు ఇప్పుడున్న తనను కూడా అంగీకరించడు.

169. బాబు : విశ్వాసము అనుభవానికి మార్గమా?

సద్గురు : అనుభవం విశ్వాసానికి మార్గము.

170. ప్రసాద్ : అనారోగ్య కారణంగా ధనుర్మాస వ్రతాన్ని
కొనసాగించలేకపోయాను...

సద్గురు : అదేమీ కాదు.
వ్రతం అనేది మనసుకు సంబంధించినది.

171. చిలకమ్మ : నాకు ఈశ్వరుడొక్కడు చాలు స్వామి...
ఇంకెవరూ వద్దు...

సద్గురు : ఉండేది ఈశ్వరుడొక్కడే
ఇంకెవరూ లేరు.

172. పట్టెయ్య : సనకసనందనాదులే కాదు,
మిగతా అందరు కూడా
బ్రహ్మ మానస పుత్రులే కదా!

సద్గురు : బ్రహ్మ కూడా నీ మానస పుత్రుడే.

173. సద్గురు : విజ్ఞానమంతా వినాశనానికే.

పి.సి.రెడ్డి : విజ్ఞానం అనేది ఆర్డర్‌లో ఉంటే వినాశనం కలుగదు.

సద్గురు : భలేవాడివే. విజ్ఞానమెప్పుడూ ఆర్డర్‌లో ఉండదు.

**174.** ఒకరు : ఆత్మను పొందటానికి మార్గమేమి?

సద్గురు : అంతటా ఉన్న వస్తువును పొందటానికి మార్గమేమిటి? గమ్యమేమిటి?

**175.** ఒకరు : సైన్సుకు, ఆధ్యాత్మికానికి తేడా ఏమి?

సద్గురు : సైన్సు, విడువబడిన బాణము యొక్క శక్తిని గురించి చెబుతుంది.
ఆధ్యాత్మికం, బాణాన్ని విడిచిన వాని యొక్క శక్తిని గురించి చెబుతుంది.

**176.** చిలకమ్మ : జ్ఞానం పొందటానికి సులభ మార్గమేమి?

సద్గురు : జ్ఞానమే చిలకమ్మగాను,
చిలకమ్మ తెలుసుకునే ప్రపంచంగాను,
చిలకమ్మను తెలుసుకునే దైవంగాను
ఉన్నదని ఉండటమే.

**177.** రవీంద్ర : మీ 'రమణ త్సంగం' సకల
విషయాలతో గందరగోళంగా
ఉన్నదేమి?

సద్గురు : జగత్తు అనేది ఈశ్వరుని సత్సంగం.
జగత్తు గందరగోళంగా ఉన్నట్టే
మా సత్సంగం కూడా గందరగోళంగానే
ఉంటుంది.

కాని రమణుడు మా సత్సంగాన్నే
ఇష్టపడతాడు.

ఇతర సత్సంగాలు రమణుణ్ణి
పట్టుకుని ఉన్నాయి.

మా రమణ సత్సంగాన్ని
రమణుడే పట్టుకుని ఉన్నాడు.

**178.** ఒకరు : సంపూర్ణారోగ్యానికి చిట్కా చెప్పండి.

సద్గురు : ఒక రోజుకు ఒక మనిషికి అయ్యే ఖర్చును (పైకాన్ని) ఏ రూపంలోనైనా సరే మీ నుంచి దూరం చేసేయండి.

**179.** సద్గురు : నీకు వెలిగా ఉన్న ప్రపంచంలో నీకు కొన్ని పరిమితులుంటాయి. నీలో ఉన్న ప్రపంచానికి నీవే ప్రభువు. నీ ఇష్టమొచ్చినట్లు జీవించే సంపూర్ణ స్వాతంత్ర్యం నీకు అక్కడే ఉంటుంది.

బాబు : అదంతా ఓ ఊహే కదా!

సద్గురు : ఇప్పుడు ఈ వెలిగా ఉన్న ప్రపంచం మాత్రం వాస్తవమా?
నిజం ఉండి నిజం అనుకోవడం కాదు.
నీవు నిజం అన్నాక నిజం అవుతుంది ఏదైనా.

180. ఒకరు : నా జన్మ తరించడం ఎలా?

సద్గురు : తరించడం సంగతి అలా ఉంచు.
తరించిన తర్వాత మీ ప్రోగ్రాం ఏమి?
ఆలోచించించు.

181. ప్రశ్న : భాషణానికి, సంభాషణానికి తేడా ఏమి?

సద్గురు : తెలియనివానితో తెలిసినవాడు మాట్లాడితే
అది భాషణం.
తెలిసినవానితో తెలిసినవాడు మాట్లాడితే
అది సంభాషణం.

182. సద్గురు : మనసు లేక లోకము కలదా?
అన్నారు భగవానులు...

కృష్ణ : అది భగవాన్ అనుభవం...

సద్గురు : భగవాను కూడా నీ అనుభవంలో భాగమే.

183. ప్రశ్న : పుట్టుక ప్రయోజనమేమి?

శ్రీసద్గురు : పుట్టుక ఇచ్చిన వాడే
పుట్టుక ప్రయోజనాన్ని నెరవేర్చుకుంటాడు.
ఆ గొడవ నీకెందుకు?

184. వర్మ : మెడ నొప్పిగా ఉంది స్వామీ!..

సద్గురు : నువ్వుల నూనె పూస్తుండండి. నయం అవుతుంది.

వర్మ : నయం అవడం నూనె వల్లనా? లేక తమరి వాక్కు వల్లనా?

సద్గురు : నువ్వు ఏదనుకుంటే అదే.
ఏదయితేనేం? మనకు సమస్య తీరాలి అంతే.

**185.** బాబు : ఈ వ్రాసే పని తెగడం లేదు...

సద్గురు : బాబూ!
సద్గురు బోధామృతమనే వర్షాన్నంతా
నీ అరచేతిలో నింపేయాలని చూస్తున్నావు.
అది అసాధ్యం.

**186.** ఒకరు : పుట్టుక ప్రయోజనమేమి?

సద్గురు : పుట్టినవాడు అడుగవలసిన ప్రశ్నను పుట్టనివాడు వేస్తే ఎలా?

ఒకరు : నేను పుట్టే ఉన్నాను కదా!

సద్గురు : నీవు పుట్టిన అనుభవం నీకున్నదా?

ఒకరు : లేదు.

సద్గురు : కాబట్టి నీవు పుట్టనే లేదు.
ఆధ్యాత్మికంలో అనుభవమే పరమప్రమాణం.

**187.** పట్టైయ్య : వ్యక్తి ఆరాధన సబబేనా?
ఫలానావాడు దేవుడు అనటానికి గుర్తేమి?

సద్గురు : బయట నుండి లోపలకు
ఏమీ తీసుకోనివాడు
లోపల నుండి బయటకు ఏమీ విసర్జించనివాడు
ఎవడైనా ఉంటే వాడే దేవుడు.

188. భక్తురాలు : బాబుగారూ! మీరెంతో అదృష్టవంతులండి! సదా గురుసన్నిధిలో గడుపుతూ మీ జీవితాన్ని ధన్యం చేసుకుంటున్నారు. మేము గురువుగారికి ఎంతో దూరంలో ఉన్నాము.

బాబు : అవునవును.
అనారోగ్యవంతుడే డాక్టరుకు దగ్గరగా ఉంటాడు.
ఆరోగ్యవంతులు డాక్టరుకు దూరంగా ఉంటారు.

189. మురుగానంద : ఒకసారి తాను 'తానై' పోయిన తర్వాత కూడా మళ్లీ జన్మలుంటాయా స్వామీ...?

సద్గురు : ఇప్పుడు నీ జన్మే అబద్ధమని చెబుతుంటే,
నీవే లేవని చెబుతుంటే ఇంకో జన్మ
ఎలా ఉంటుంది?

ఒక వేళ జన్మలున్నా నీకొచ్చిన
ఇబ్బందేమీ ఉండదు.

ఎందుకంటే ఎన్ని సినిమాలు వేసుకున్నా
'తెర'కొచ్చిన ఇబ్బందేమీ ఉండదు కదా!

తెర సదా తెరగానే ఉంటుంది.
నీవు సదా నీవుగానే ఉంటావు.

**190.** చిలకమ్మ : ఎందుకు పుట్టామో
ఎందుకు జీవిస్తున్నామో
తెలియటం లేదు స్వామీ....!

సద్గురు : మనల్ని భూమ్మీదకు పంపినవాడికొక్కడికి
మాత్రమే ఆ రహస్యం తెలుసును.
భూమ్మీదున్న ఎవ్వడికీ తెలియదు.

చిలకమ్మ : అంతేనా స్వామీ...

సద్గురు : అంతే.
ఆ సమస్యను నువ్వు బయటకు చెప్పావు.
మేం చెప్పలేదు. అంతే తేడా.

ఎవడికి వాడికి స్వంతంగా తెలుసుకునే సత్తా
ఉన్నట్లయితే వీళ్లే దేవుళ్లయిపోరూ!

(నవ్వుతూ) వీళ్లందరూ దేవుళ్లయిపోతే
'అసలు దేవుడు' ఏమైపోవాలి?

**191.** బాబు : ఎగిరే పక్షి నిశ్చలం కావాలంటే ఏమి చేయాలి?

సద్గురు : పక్షి ఆకాశంగా మారుకోవాలి.

బాబు : పక్షి ఆకాశంగా ఎలా మారుతుంది?

సద్గురు : పక్షి పక్షిగా ఎలా మారిందో అలానే.

బాబు : మనసు నిశ్చలం కావాలంటే ఏం చేయాలి?

సద్గురు : మనసు ఆత్మగా మారుకోవాలి.

బాబు : మనసు ఆత్మగా ఎలా మారుతుంది?

సద్గురు : మనసు మనసుగా ఎలా మారిందో అలానే.

బాబు : చల, నిశ్చల ప్రవృత్తులు మన స్వాధీనంలో లేనివన్న మాట.

సద్గురు : అంతే.

192. బాబు : సర్వజ్ఞుడు అంటే?

సద్గురు : ఈ వైపు నుంచి సర్వమూ తెలిసినవాడు.
ఆ వైపు నుంచి తాను తప్ప సర్వమూ లేనివాడు.

193. సద్గురు : బాబూ! ఈశ్వరుడు న్యాయస్తుడా? అన్యాయస్తుడా?

బాబు : న్యాయస్తుడే.

సద్గురు : మరి ఈశ్వరుని సృష్టిలో అన్యాయాలు జరుగుతున్నాయని గుండెలు బాదుకోవడ మెందుకు?

అన్యాయమైనది, అధర్మమైనది, అసత్యమైనది ఈశ్వరసృష్టిలో ఎందుకుంటుంది?

ఈశ్వరసృష్టిలో ఒక్క పొరబాటు కూడా ఉండదు.

194. ఒకరు : గీతా సారాంశమేమి?

సద్గురు : 'నేను కర్తను' అన్న భావన తొలగడం.

**195.** ప్రశాంతి : గురువుగారూ! ఈశ్వరుణ్ణి ధ్యానం
చేస్తున్నాగానీ మా సమస్యలు
తొలగడం లేదేమి?

సద్గురు : తల్లిగర్భంలో ఉండే శిశువుకి
తల్లికి మించిన శక్తులు ఎలా ఉంటాయి?
నీలో ఉండే శివుడికి
నీకున్న శక్తే ఉంటుంది.
శివుడిలో ఉన్న నీకు
శివునికున్న శక్తి ఉంటుంది.
కాబట్టి
నీలో శివుడుండడం కాదు.
శివుడిలో నీవుండాలి.

**196.** బాబు : మఠాలకు, ఆశ్రమాలకు వారసులు అవుతున్నారే
గాని తత్త్వానికి ఎవరూ వారసులు కావడం లేదు...

సద్గురు : అది వీలు కాదు...

**197.** బాబు : సత్సంగంలో మీరు ప్రస్తావించిన సబ్జెక్టు
రమణులు కూడా టచ్ చేయలేదు.

సద్గురు : రమణులే ఇక్కడ టచ్ చేస్తున్నారు.

**198.** ఒకరు : ఇంతకీ మన కర్తవ్యమేమి?

సద్గురు : ఏ కర్తవ్యమూ లేకుండా ఉండడమే మన కర్తవ్యము.

199. ఒకరు : అనుకున్నదేదీ జరగటం లేదు స్వామీ...

సద్గురు : నీవు నిజంగా అనుకోలేదనే దాని అర్థం.
జరిగితేనే నీవు నిజంగా అనుకున్నావు
అన్నదానికి గుర్తు.

200. రామసీత : గురువుగారూ!
మామూలు స్వప్నానికి, మాయా స్వప్నానికి
తేడా ఏమి?

సద్గురు : మామూలు స్వప్నంలో -
కలలో వాళ్ళకు
కలను కనేవాని విషయం తెలియదు.

కలను కనేవానికి
కల విషయం తెలుసును.

మాయా స్వప్నంలో -
కలలోని వాళ్లకు
కలను కనేవాని విషయం తెలుసును.
కలను కనేవానికి కల విషయం తెలియదు.

201. కాశిరెడ్డి : నియమ నిష్ఠలుండడం అవసరమా?

సద్గురు : నియమనిష్ఠల వలన ఏదో దొరుకుతుంది
అన్న అభిప్రాయంలో ఉండి,
నియమ నిష్ఠలను కలిగి ఉండడం దోషం.

"అది" (సద్వస్తువు) ఒకదానితో రాదు.
ఒకదానితో పోదు అన్న సత్యాన్ని
ఎఱిగి నియమ నిష్టలను కలిగి ఉండొచ్చు.

202. ప్రశ్న : ఏకంగా ఉన్న తాను అనేకం అవ్వాలని భగవంతుడు ఎందుకు సంకల్పించాడు?

సద్గురు : నిద్రలో ఏకంగా ఉన్న నీవు మెలకువలో అనేకం అయినట్లే, భగవంతుడు అనేకం అవడం కూడా.
Everything is possible for GOD.
భగవంతునికి అన్నీ సాధ్యమే.
'ఎందుకు?' అన్న ప్రశ్న అజ్ఞాన జనితం.

203. ఒకరు : ఒక వ్యక్తిని దేవుడని పూజిస్తున్నారు. ఇది సరియేనా?

సద్గురు : చెట్లని, పుట్లని
నందిని, పందిని
దేవుడు అని కొలిచే సంప్రదాయం మనది.
మనిషిలో దేవుణ్ణి చూడడం తప్పా?

204. బాబు : దేవుడు అవసరమా?

సద్గురు : అవసరమే దేవుడు.

205. రవీంద్ర : 'సంస్కారం' గుఱించి మీ అభిప్రాయమేమి?

సద్గురు : 'సంస్కారం' అనేది కూడా అభిప్రాయమే.

**206.** సద్గురు : మేలుకోవడానికి ఎంత సమయం పడుతుంది.

గోపాలకృష్ణ : Split of Seconలో మెలకువ వస్తుంది.

సద్గురు : అలాగే మెలకువ వచ్చినప్పటున్నుంచి నిద్రపోయే వఱకు గడిపిన జీవితం కూడా అంతే సమయంలోనే పూర్తయిపోతుంది.

నిద్రలోకి జారినప్పటి నుంచి తిరిగి మెలకువ వచ్చే వఱకు పట్టే సమయం కూడా అంతే. అంతేకాదు, సృష్ట్యాది నుండి లయం వఱకు ఉన్న జగత్తు యొక్క 'స్థితి' కూడా అంత సమయమే.

**207.** బాబు : మౌనమే శ్రీరమణుల ప్రధానోపదేశము. ఆత్మ విచారం ద్వితీయమే.

సద్గురు : మౌనమే ద్వితీయం.

**208.** భగవంతుడు: భక్తా! ఏం వరం కావాలో కోరుకో...

భక్తుడు : హే భగవాన్! నువ్వే చెప్పు నేనేం కోరుకోవాలో...

**209.** బాబు : సృష్టి స్థితి లయాలెందుకు?

సద్గురు : ఇదంతా మాయామయి జ్ఞానాంబ లీలా విశేషం అనడం కంటే మరో విశేషం ఏమీ కనబడడం లేదు. 'లీల' అన్నాక 'ఎందుకు?' అన్న ప్రశ్నకు తావు

లేదు. లీలను లీలగానే దర్శించడం కంటే
పరమార్థం వేరే ఏమీ లేదు.
చూ - స్తూ - ఉం - డు.
ఈ నాలుగు అక్షరాలే.
నాలుగు వేదాల సారం.

210. బాబు : భగవానులు చెప్పిన 'సుమ్మా ఇరు'
(ఊరక ఉండు) అంటే ఏమి?

సద్గురు : నీ గురించి గాని,
ప్రపంచం గురించి గాని
దేవుని గురించిగాని చెప్పకుండా
ఏదయినా ఒక మాట ఉంటే చెప్పు...

బాబు : (ఏమీ తోచక మౌనం వహించాడు)

సద్గురు : (నవ్వుతూ) ఈ మౌన స్థితియే
సుమ్మా ఇరు అంటే.

211. ప్రశ్న : వేదాంతం అంటే?
సద్గురు : సుపీరియర్ సైన్స్.

212. ప్రశ్న : ఆత్మానుభవం అంటే?

సద్గురు : అనుభవాన్ని అనుభవించే అనుభవమే
ఆత్మానుభవం.

**213.** బాబు : లోకంలో దుఃఖం ఎందుకుండాలి?

సద్గురు : ఎందుకు ఉండకూడదు?
ఇదీ ఒక ప్రశ్నే కదా!
ఎందుకు ఉండకూడదు? అన్న ప్రశ్నకు
సమాధానం దొరికితే,
ఎందుకు ఉండాలి? అన్న ప్రశ్నకు కూడా
అదే సమాధానం అవుతుంది.

**214.** ఒకరు : స్వామీ! దైవానుగ్రహం కలగాలంటే ఏం చేయాలి?

సద్గురు : అది ఎప్పుడూ ఉంది.
కావాల్సింది నీ అంగీకారం.

* * *

500 రూ॥లతో నువ్వెంత దూరం ప్రయాణం చేయగలవో అంత దూరం ప్రయాణించి అక్కడ దిగాలి. ఇక నీ చేతిలో ఒక్క నయాపైసా కూడా ఉండకూడదు. అక్కడ ఓ నెలరోజులు గడిపి తిరిగి నీ స్వస్థానానికి రాగలిగితే అప్పుడు అనుభవంలోకి వస్తుంది దైవానుగ్రహం అనేది.

**215.** వర్మ : 'బాబు' అనే గొప్ప శిల్పాన్ని చెక్కిన
గొప్ప శిల్పి మీరు...

సద్గురు : కాదు కాదు.
'సద్గురు' అనే గొప్ప శిల్పాన్ని చెక్కిన
గొప్ప శిల్పి బాబు.

216. ప్రశ్న : దేవుడెవడు?

సద్గురు : దేవుణ్ణి వెదకనివాడు.

217. ఒకడు : మీ నాస్తిక సంఘం ఎలా నడుస్తోంది?

నాస్తికుడు : దేవుని దయవల్ల బాగానే నడుస్తోంది.

218. బాబు : చిరంజీవి అంటే?

సద్గురు : చావు పుట్టుకలు రెండూ లేనివాడు.

219. బాబు : "ఎవరూ రమణుల వద్దకు వెళ్లకండి. వెళ్లినవారు ఇక తిరిగి రారు" అనేవారు శ్రీఅరవిందులు.

శ్రీసద్గురు : మంట వద్ద కూర్చుని చలికాచుకోవడం లాంటిది అరవిందుల యోగవిహారం.

మంటలో దూకి 'తాను' లేకుండా పోవడం లాంటిది శ్రీరమణుల జ్ఞాన విచారం.

220. ఒకరు : ఇంతకీ మీరు ఏం చెప్పదలచుకున్నారు?

సద్గురు : ఏమీ లేదు.

221. సద్గురు : Mountain path అంటే?

బాబు : కొండకు దారి.

సద్గురు : కాదు. కొండయే దారి అని అర్థం.

సద్గురు : Self Enqiury అంటే?

బాబు : ఆత్మను విచారించడం.

సద్గురు : కాదు. ఆత్మచేసే విచారణ అని అర్థం.

222. ప్రశ్న : ఆశ్రమం అంటే?

సద్గురు : ఈ శ్రమను (సంసార తాపాన్ని) తొలగించి ఆ శ్రమను (ఆధ్యాత్మిక తాపాన్ని) కలిగించేది ఆశ్రమం.

223. ప్రశ్న : సత్యమేది?

సద్గురు : అసత్యం.

ప్రశ్న : అసత్యమేది?

సద్గురు : సత్యం.

224. నాగేశ్వర్ : నేను గురువు కోసం వెదుకుతున్నాను.

సద్గురు : నేను శిష్యుని కోసం వెదుకుతున్నాను.
ఒక్కడూ దొరకలేదు.
నాకు అందరూ గురువులుగానే కనబడుతున్నారు.

225. లీల : ప్రతి వ్యక్తి ఎందుకు వేదనను, అజ్ఞానాన్ని అనుభవిస్తున్నాడు?

సరస్వతి : సృష్టి ప్రారంభమున అనంత చైతన్యమును నెలకొల్పిన నియతి అట్టిది.

**226.** పట్టెయ్య : శ్రీ సద్గురు బోధనలను విన్న తర్వాత ఇక శాస్త్రాలతో పనిలేదనిపిస్తోంది...

బాబు : బల్లి బడితే శాస్త్రం గాని
పిడుగు పడితే ఇక శాస్త్రంతో పనేముంది?

**227.** కైలాసం (క్షురకుడు) : గురువుగారూ!
తమరికి ముండనం చేసేటప్పుడు మీ శిరస్సుని శివలింగంగా భావిస్తుంటాను.

సద్గురు : మంచిది. ఇది కళ్లుండే శివలింగం.

**228.** రామాంజనేయులు : గురువుగారూ మాయ నుండి బయటపడే మార్గాన్ని చూపండి.

సద్గురు : మాయ అనేది ఒకటి ఉందని అనుకోవడమే మహా మాయ.

'మాయ' అనేది లేదని తెలుసుకోవడమే మాయ నుంచి బయట పడడం.

**229.** ప్రశ్న : జన్మ రాహిత్యం అంటే?

సద్గురు : ప్రస్తుత జన్మే లేదని తెలుసుకోవడం.

**230.** ప్రశ్న : దైవానుభవం అంటే?

సద్గురు : తాను ఉండి, దైవానుభవాన్ని అనుభవించడం కాదు, దైవమే తానైపోవడం.

'అనుభవం' అంటూ ఏమీ ఉండదక్కడ.

231. పట్టెయ్య : ఆత్మ తత్త్వం అవగాహన అయ్యే కొద్దీ జీవితం ఏరుచీ పచీ లేని చప్పటి కూరలా తయారయ్యింది...

సద్గురు : నీవు ఆ స్థితిని కోరి తెచ్చుకున్నావు.
నేతి – నేతి (ఇది కాదు – ఇది కాదు) అంటూ
ఇంకా దీనికంటే గొప్పది (Ultimate)
ఏదో ఏదో ఉందని
అలా అలా అన్వేషిస్తూ ఆధ్యాత్మికమనే
పర్వత శిఖరాగ్రానికి వెళ్ళిపోయావు.
అక్కడ దర్శనమిచ్చిన మహా శూన్యానికి
నీ మనస్సు స్తబ్ధత పొందింది.
చివరి దశలో అటువంటి అనుభవం
కలగడం సహజం.

* * *

సుఖానుభవం
అజ్ఞానికే గాని జ్ఞానికి ఉండదు.
ఆనందం
తెలియనివానికే గాని తెలిసినవానికి ఉండదు.
పారవశ్యం
భక్తునికే గాని భగవంతునికి ఉండదు.
ఆధ్యాత్మికానుభవం
శిష్యునికే గాని గురువుకు ఉండదు.

జీవన మాధుర్యం
సంసారికే గాని సన్న్యాసికి ఉండదు.

* * *

'ఇప్పుడు - ఇక్కడ - ఇలా' వఱకే ఉంటే
జీవితం రసమయంగానే ఉంటుంది.

232. హిందీసార్ : 'నీచం' అంటే ఏమి?

సద్గురు : సకలానికి ఆధారమై ఉన్నది.
తామరలకు ఆధారమై ఉన్న బురద వలె.

233. ప్రశ్న : వేదాంత ప్రయోజనమేమి?

సద్గురు : నది గట్టున చేరి ప్రవాహాన్ని చూస్తున్నట్టు ఈ జీవిత ప్రవాహాన్ని అలాచూస్తూ అందులో మునిగి కొట్టుకు పోనీయకుండా సాక్షిగా ఉండేటట్లు చేస్తుంది.

234. సద్గురు : ప్రశ్న వేసినవాడు గొప్పవాడా?
సమాధానం చెప్పినవాడు గొప్పవాడా?

మురుగానంద : సమాధానం చెప్పేవాడు గొప్పవాడు.

సద్గురు : ప్రశ్నించినవాడు ఉపాధ్యాయుడు.
సమాధానం చెప్పినవాడు విద్యార్థి.
ఇప్పుడు చెప్పు ఎవరు గొప్పో?

మురుగానంద : ప్రశ్న వేసినవాడే గొప్పవాడు.

సద్గురు : కాబట్టి ప్రశ్నించినవాడూ గొప్పవాడే.
ప్రశ్నించినవాడు సమాధానం తెలియక అడుగడు.
అతనిలో సమాధానం కూడా ఉంటుంది.
అందువల్లనే సమాధానం విన్న తర్వాత ఊరక ఉండిపోతాడు. అంటే బయట దొరికిన సమాధానం లోపల ఉన్న సమాధానానికి సరిపడిందన్నమాట.

235. బాబు : జ్ఞానిని జ్ఞానే గుర్తించగలడు...

సద్గురు : జ్ఞాని జ్ఞానే అయితే
తాను గుర్తించడానికి తాను తప్ప
అన్యమేమీ గోచరించదు.

236. ప్రశ్న : భగవంతుడు పతితపావనుడు అంటే?

సద్గురు : పతితుడూ అతడే.
పావనుడూ అతడే అని అర్థం.

237. ప్రశ్న : మాయ అంటే ఏమి?

సద్గురు : 'ఉన్నది - ఒకటే - అది - నేనే'
అన్న స్వస్థితిలో తనను ఉండనీక చలింపచేసే శక్తి ఏదయితే ఉన్నదో అదే మాయ.

238. సద్గురు : చివరకు మిగిలేది ప్రశ్నా?
సమాధానమా?

బాబు : శేష ప్రశ్న అంటారే గాని,
శేష సమాధానము అని ఎవరూ అనరు కదా!
కాబట్టి చివరికి మిగిలేది ప్రశ్నే.

సద్గురు : కరెక్ట్.

మసక చీకటిలో త్రాడును పాముగా
భ్రమించాం. దీపం వెలుగులో అదిపాము
కాదు త్రాడు అని తెలుసుకున్నాం.

మరి త్రాడుగా ఉండేది ఏది? అని మరొక్క ప్రశ్న
వేసుకుంటే 'సమాధానం' అక్కడే ఉంటుంది.

త్రాడుగా ఉండేది ఏది అన్న శేషప్రశ్నకు
సమాధానమే శ్రీదక్షిణామూర్తి స్వరూపం.

**239.** ఒకరు : నేనెవడను? విచారణ ఎందుకు?

సద్గురు : తాను కానిదానిని తాను అని అనుకుని
దుఃఖిస్తున్నాడు కాబట్టి.

**240.** ప్రశ్న : శాస్త్ర ప్రమాణం అవసరమా?

సద్గురు : తన భార్యతో తాను సంసార సుఖాన్ని
అనుభవిస్తున్నానా? లేదా? అన్నది స్వయం
ప్రమాణమే గాని ఇతరుల ప్రమాణం అవసరమా?

స్వస్వరూపమైన ఆత్మసుఖాన్ని అనుభవిస్తున్నానా?
లేదా? అన్నది స్వయం ప్రమాణమేగాని శాస్త్ర
ప్రమాణం అవసరం లేదు.

**241.** సుబ్బరాయుడు : ప్రతిరోజూ **108** సార్లు రామనామ జపం చేస్తున్నాను స్వామీ....!

సద్గురు : దానికంటే ముక్తికి దగ్గర మార్గం చెబుతా విను. ప్రతి రోజూ **108** రూపాయలు తీసుకుని వీధిలో పారెయ్యి.

**242.** పావని : ప్రార్థనలు అవసరమా?

సద్గురు : భగవంతుడు గ్రుడ్డివాడా? లేక చెవిటి వాడా?
ఆయనకు సర్వమూ ఎఱుకే.
నువ్వేమీ గుర్తు చేయనక్కర్లేదు.
మౌనమే గొప్ప ప్రార్థన.

**243.** ప్రసాద్ : నామరూప రహితుడు అంటే?

సద్గురు : అన్ని రూపములు
అన్ని నామములు
తానైనవాడు అని అర్థం.

**244.** ఒకరు : ఓ పిచ్చివాణ్ణి పట్టుకుని, పనిగట్టుకుని అతణ్ణి దేవుణ్ణి చేసి బాబాగా పూజిస్తున్నారు కొందరు...

సద్గురు : అవునవును. ఆ విషయం ఆ బాబాకు ఒక్కడికే బాగా తెలుసును, పిచ్చిలేనివాడు భగవంతుడు ఒక్కడే అని.

**245.** మురుగానంద : ప్రాణానికి – జీవానికి తేడా ఏమిటి?

సద్గురు : ప్రాణం సర్వగతమైనది.
అది వ్యక్తమైతే దానికి 'జీవం' అని పేరు.

**246.** ఒకరు : ఏది సత్యం? ఏది అసత్యం?

సద్గురు : అని వివేచించే తానే సత్యం.
మిగతా అంతా అసత్యం.

**247.** బాబు : నిర్గుణ పరబ్రహ్మము
సగుణ పరబ్రహ్మము
అంటే ఏమి?

సద్గురు : 'నేను' అనేది నిర్గుణ పరబ్రహ్మము.
'బాబు' అనేది సగుణ పరబ్రహ్మము.

**248.** పట్టెయ్య : బాబుగారి హస్తాక్షరాలు పేర్చిన ముత్యాల్లా ఉంటాయి స్వామీ...

సద్గురు : పెళ్లి కూతుర్ని కాకుండా పెళ్లికూతురు కట్టుకున్న చీరను మెచ్చుకున్నట్లుంది, అందులో ఉన్న తత్త్వాన్ని వదలి అక్షరాల్ని మెచ్చుకోవడం.

**249.** ఒకరు : మీ 'జ్ఞానప్రసూనాలు'చదివాను.
నాకు బాగా నచ్చిన వాక్యాలను నా డైరీలో వ్రాసుకున్నాను...

బాబు : మీకు నచ్చినవన్నీ మీవే.
బహుశా అద్దం మాదే కావొచ్చు.
అందులో మీరు చూసే ప్రతిబింబం మీదే.

250. ప్రశ్న : దైవ లక్షణం ఏమి?

సద్గురు : రాకడ – పోకడ అనేవి లేక
కేవలం "ఉండటం" (ఉనికి)
అనేది దైవ లక్షణం.

251. మురళి : 'అది' అనుభవంలోకి రాదు...

సద్గురు : నిజమే! అనుభవమే తాను కాబట్టి.

252. ప్రసాద్ : అంతా ఒకటే.

సద్గురు : ఒకటే అంతా.

253. ప్రశ్న : షిర్డీబాబా దత్తావతారమా?

సద్గురు : ఉండేది భగవంతుడొక్కడే.
ఆయన ఎత్తిన అవతారం ఒకటే ఒకటి.
ఆ అవతారమే ప్రపంచం.

254. బాబు : అరుణాచలంలో ప్లేగు మహమ్మారి వ్యాపించి
ఉన్నప్పటికీ రమణుడు అరుణాచలాన్ని వదలలేదు.

సద్గురు : అలాకాదు చెప్పాల్సింది.
అరుణాచలం రమణుణ్ణి వదలలేదు.

**255.** మురళి : అజ్ఞానం ఎందుకు ఉంది?

సద్గురు : ఉంది అనుకుంటున్నావు కాబట్టి.

**256.** బాబు : శరణాగతి అంటే?

సద్గురు : జీవితమనేది Already షూటింగ్ పూర్తయిపోయి రిలీజ్ అయిపోయిన సినిమా లాంటిది.

సినిమా పూర్తయ్యే వరకు ఇక నీవు చేయగలిగేది, మార్చగలిగేది ఏమీ లేదు.సాక్షిగా, ప్రేక్షకుడుగా చూస్తూ ఉండడం తప్ప.

సుఖమైనా, దుఃఖమైనా Face చేయి Taste చేయి.
అన్నిటికీ సిద్ధపడి ఉండడమే మహాసిద్ధి.
అదే శరణాగతి.

**257.** బాబు : స్వాతంత్ర్యానికి, స్వేచ్ఛకు తేడా ఏమి?

సద్గురు : స్వేచ్ఛను ఒకడిస్తే అది స్వాతంత్ర్యం.
మరొకడు ఇవ్వడం మీద ఆధారపడి ఉండకుండా సహజంగా ఉన్న స్వాతంత్ర్యమే స్వేచ్ఛ.

**258.** ప్రశ్న : ఎవడు అవధూత?

సద్గురు : జీవితమనే ఆట ఆడొచ్చు, ఆడకపోవచ్చు.
గెలవచ్చు, గెలవక పోవచ్చు.
వీటితో నిమిత్తం లేకుండా ఉన్నవాడు అవధూత.

259. బాబు : యుగాల పర్యంతం 'అబద్దాన్ని' మోసుకొస్తోంది ఈ ఆధ్యాత్మికం...

సద్గురు : యుగాలే అబద్ధం.

260. శ్రీసద్గురు : ఖడ్గం అన్న పదానికి అర్థమేమి?

బాబు : కత్తి.

శ్రీసద్గురు : (నవ్వుతూ) కత్తి అనేది కూడా ఓ పదమే కదా!

ఒక పదానికి మరొకపదం అర్థం అవుతుందా? కత్తి అన్న పదానికి అర్థం అడిగితే మరొకపదం చెబుతావు. అలా చెప్పుకుంటూపోతే చివరకు మౌనమే శేషిస్తుంది. ఆ మౌనమే అన్ని పదాలకు అర్థం అవుతుంది.

261. ఒకరు : నేను అనుకున్నట్టు జరగడం లేదు స్వామీ...

సద్గురు : అనుకోవడం అనేది సహజమైనది.

జరగడం అనేది సహజమైనది.

262. ప్రశ్న : నీతిశాస్త్రం, వేదాంత శాస్త్రం ఒక్కటేనా?

సద్గురు : కాదు. అవి వేఱు వేఱు.

మొదటిది సాంఘీకం.

రెండవది వ్యక్తిగతం.

నీతి అనేది పరమార్థం కాదు,

అట్లని పరమార్థం నీతిమాలినది కాదు.

**263.** ఒకరు : నేను బాబాను కొలుస్తున్నాను.
అయినా కష్టాలు తొలగడం లేదు.
ఎందుకు?

సద్గురు : అదేమైనా అగ్రిమెంటా?
ఏ పరిస్థితి అయినా సరే
వస్తే రానీ – పోతే పోనీ
అని ఉండగలగడమే
శరణాగతికి గొప్ప తార్కాణం.

**264.** ప్రశ్న : **సద్గురువు అంటే?**

సద్గురు : బ్రహ్మను సృష్టించినవాడు.
విష్ణువును పరిపాలించేవాడు.
శివుణ్ణి లయింపచేసేవాడు.
సరస్వతికి చదువు చెప్పినవాడు.
లక్ష్మీదేవికి సంపదనిచ్చినవాడు.
పార్వతీదేవికి సౌభాగ్యాన్నిచ్చినవాడు.
నారదుడికి సంగీతం నేర్పినవాడు.
ఆదిశేషునికి ఆధారమై ఉన్నవాడు.
పరబ్రహ్మానికి నామకరణం చేసినవాడు.
వేదాలకు మాటలు నేర్పినవాడు.
యముడికి మృత్యు భీతిని కలిగించినవాడు.
సూర్యదీపాన్ని వెలిగించినవాడు.

గ్రహాల్ని బొంగరాల్లా త్రిప్పేవాడు.
ఆకాశానికి అవకాశమై ఉన్నవాడు.
అంతరిక్షాన్నే అంతర్ముఖంగా ఉన్నవాడు.
ఆది అంతము లేనివాడు.
నాది నీది లేని వాడు.
నేను నీవు లేనివాడు.
గురువు శిష్యుడు లేనివాడు.

**265.** పట్టెయ్య : గురువు అంటే మార్గం చూపించేవాడు అని అర్థమా?

బాబు : కాదు.కాదు.
గురువే మార్గము.
గురువే గమ్యము.
గురువే దైవము.
గురువు ద్వారా పొందదగినది ఏదీ లేదు.
గురువే పరమ వస్తువు.
గురువే పరమపదము.

**266.** ఓ తండ్రి : మాకున్న ఒక్కగానొక్క కుమారుడు ఆధ్యాత్మికం, వేదాంతం అంటూ వివాహం అంటేనే విరక్తితో ఉన్నాడు. దయచేసి పరిష్కారం చూపండి.

సద్గురు : మా రమణ సత్సంగం వాళ్ళు ప్రచురించిన కొన్ని పుస్తకాల్ని ఇస్తాను. తీసుకెళ్ళి మీ కుమారునికి

ఇవ్వండి. వాటిని చదివితే వైరాగ్యం తొలగుతుంది. జీవితం పట్ల అనురక్తి కలుగుతుంది. వివాహానికి అంగీకరిస్తాడు.

**267.** ఒకరు : ఈ సంసార బాధ్యతలన్నీ తీర్చుకుని ప్రశాంతంగా భగవద్ధ్యానంలో గడపాలని అనుకుంటున్నాను స్వామీ...

సద్గురు : నీ వొక్కడే అనుకుంటే సరిపోదు.
భగవంతుడు కూడా అనుకోవాలి.

**268.** బాబు : 'ఉన్నది' అనేదే ఆస్తికత.

సద్గురు : 'ఉన్నది' అని గుర్తించేవాడే ఆస్తికుడు.

**269.** ప్రశ్న : గొప్ప జ్ఞాన గ్రంథాలు ఏవి?

సద్గురు : **1.** యోగవాశిష్ఠం.
**2.** త్రిపురా రహస్యం.
**3.** ఉన్నది నలుబది.
**4.** జ్ఞాన ప్రసూనాలు.

**270.** బాబు : అరుణాచలం వెళదామని అనుకుంటున్నాను.

రాజారాం : ఎక్కడికెళ్లినా
అదే చెట్లు
అదే గోడలు
అదే కొండలు
'ప్రత్యేకత' అనేది మనం ఆపాదించుకున్నదే.

271. బాబు : సత్సంగానికి 'యమధర్మరాజు సత్సంగం' అని పేరు పెడితే బాగుండేది....

సద్గురు : ఏ పేరు పెట్టుకున్నా అన్నీ యమధర్మరాజు సత్సంగాలే.
అహంకార నాశకాలే.

272. బాబు : కర్తృత్వ భావన వొదులు అంటే?

సద్గురు : 'బాబు'ను వదలడం.

273. బాబు : పుస్తకానికి తమరి ఫోటోను ముఖ చిత్రంగా వేయాలని అనుకున్నాను.
కాని రెడ్డిగారు 'తాత' గారి ఫోటోను వేయాలని సంకల్పించారు...

సద్గురు : అది రెడ్డి గారి సంకల్పం కాదు.
తాతగారి సంకల్పం.
నా ద్వారా మాట్లాడేది తాతగారే.
నేను కేవలం ఆయన ముందున్న మైకును.
కాబట్టి తాతగారి ఫోటోను వేయడమే సబబు.

274. సద్గురు : ఈ టేబుల్ మీదున్న ఆధ్యాత్మిక గ్రంథము, అకౌంటు బుక్కు, వార పత్రిక ఈ మూడు ఒకటేనా?

గురప్ప : కాదు.

సద్గురు : ఒకటే. అన్నీ కాగితాలే, అన్నీ అక్షరాలే.

275. భూపతి : భగవంతుడు జీవుల్ని ఎందుకిట్లా ఆడిస్తున్నాడు?

సద్గురు : వచ్చిన కలను చూడడం తప్ప,
నచ్చిన కలను చూడడం కుదరదు.

276. బాబు : సంప్రదాయము అంటే?

సద్గురు : తనతో తాను
తనలో తాను
సంప్రదించి
ఒక నిర్ణయానికి వచ్చే కార్యక్రమానికే
'సంప్రదాయం' అని పేరు.

277. పట్టెయ్య : మీరు చెప్పేది సత్యమే అయినప్పటికీ
అంగీకరించలేకపోతున్నాను స్వామీ...

సద్గురు : నేనుకూడా అంగీకరించలేకపోతున్నాను.

278. సౌరీస్ : సాధన చేశాం, ఇది చేశాం, అది చేశాం
అంటారు. ఇదంతా ఏమిటి? ఎప్పుడూ తెరచి వున్న
తలుపును తట్టడం.

సద్గురు : అసలు దానికి తలుపులూ లేవు,
తట్టడమూ లేదు.

279. ఒకరు : ఎవరూ లేకపోవడమే దేవుడు ఉండడం.
ఏమీ తెలియకపోవడమే దేవుణ్ణి తెలియడం.
ఏ అనుభవమూ లేకపోవడమే దైవానుభవం.
అని చెప్పారు మీరు. అది ఎలా?

సద్గురు : తాను మేలుకోక మునుపు తానున్న స్థితి అది.

**280.** ఒకరు : స్వామీ! తమరి ఆశ్రమం ఉందా ?
ఎక్కడుంది?

సద్గురు : ఆశ్రమమైతే ఉందిగాని
అడ్రసు లేదు.

**281.** ప్రసాద్ : నేను స్థిమితంగా ఉండలేకపోవడానికి కారణమేమి?

సద్గురు : నీకున్నది 'వద్దు' అనుకోవడం.
నీకు లేనిది 'కావాలి'అనుకోవడం.

**282.** పట్టెయ్య : స్వామీ! శివమాలను పారాయణం చేయమంటారా?

సద్గురు : నీ శ్వాసకు ఆధారంగా ఉన్న 'నిన్ను' నీవు గుర్తెరిగితే
నీ ప్రతి శ్వాసా పారాయణమే అవుతుంది.
అని తెలియడం కొఱకే ఈ పారాయణాలన్నీ.

**283.** ప్రసాద్ : అందానికి, సౌందార్యానికి తేడా ఏమి?

సద్గురు : అందం అనేది బాహ్యానికి సంబంధించినది,
సౌందర్యం అనేది ఆంతరానికి సంబంధించినది.

**284.** పట్టెయ్య : నాకు భగవంతుణ్ణి చూపించగలరా?

సద్గురు : అని భగవంతుడే అడిగితే
నేనేం చెప్పగలను?

**285.** పట్టెయ్య : అసలు నన్నెందుకు భగవంతుడు
పుట్టించాడు?

సద్గురు : ఆ ప్రశ్న వేయడానికే.

**286.** సద్గురు : మనం సత్సంగం జరుపుకోవడానికి ముఖ్యావసరమైన బార్‌లైట్‌ను మీలో ఎవరైనా, ఏ రోజైనా, ఒక్కసారైనా గుర్తుకు తెచ్చుకున్నారా?

పి.సి.రెడ్డి : లేదు.

సద్గురు : దేవుడు కూడా ఆ విధంగానే మిస్ అయిపోతున్నాడు.

దేవుడు లేక కాదు, దొరక్కకాదు.
మనం చూడక.

**287.** ఒకరు : జీవితం ముగిసిపోతోందంటే, ఒక విధమైన విచారం...

సద్గురు : చదువు ముగిసిపోతోందంటే సంతోషం.
ఉద్యోగం వస్తుందని.
ఉద్యోగం ముగుస్తోందంటే సంతోషం.
కుటుంబంతో హాయిగా గడపొచ్చు అని.
జీవితం ముగిసిపోతోందంటే ఎందుకింత విచారం?
దేవుడితో, హాయిగా గడపుతానని
సంతోషపడాలి కదా!

**288.** ప్రసాద్ : ఆనందం అంటే?

సద్గురు : స్వస్వరూపం.

289. ప్రశ్న : ఏది సత్యం?
ఏది అసత్యం?

సద్గురు : బ్రతికేవాడు సత్యం.
బ్రతుకంతా అసత్యం.

290. బాబు : భగవానులు తల్లిగారికి చేసిన
తొలి ఉపదేశమైన,
కర్త వారి వారి ప్రారబ్ధ కర్మానుసారంగా
జీవులనాడించును... వివరించండి.

సద్గురు : కర్త (ఈశ్వరుడు) – కుమ్మరి.
మట్టిముద్దతో ఏ పాత్రను తయారు చేయాలన్నది
ఆయన యొక్క ఇచ్ఛ.
ఆ ఇచ్ఛయే ప్రారబ్ధం.
అంతేగాని ప్రారబ్ధం అనేది 'గతజన్మ కర్మ' విశేషం
కాదు.
ఆ ప్రారబ్ధమే పాత్రల యొక్క స్వరూప స్వభావాలను
నిర్ణయిస్తుంది.
కర్త జీవులను ఆడించడం అంటే,
ఆయా పాత్రల స్వరూప స్వభావాలను అనుసరించి
వాటిని వాడుకోవడం.

291. పట్టెయ్య : 'నా తలవ్రాత'అంటారు కదా...!

సద్గురు : తల (బుద్ధి) స్వయంగా వ్రాసుకున్న వ్రాతే తలవ్రాత.

**292.** ప్రసాద్ : ప్రశ్నే పుట్టని స్థితిని సాధించడం ఎలా?

సద్గురు : "నేను" పుట్టని చోటుకు చేరుకుంటే సరి.

**293.** పట్టెయ్య : మౌనం అంటే?

సద్గురు : అనంతమైన మాట.

**294.** భాస్కర్ : **1.** దేవుడంటే ఎవడు?

**2.** ఎక్కడున్నాడు?

**3.** ఏం చేస్తున్నాడు?

సద్గురు : **1.** అనంతుడు.

**2.** అంతటాఉన్నాడు.

**3.** ఏమైనా చేయడానికి.

అతడికి అన్యం లేదు.

**295.** ప్రశ్న : శివుడనగా?

సద్గురు : శివుడనగా నిశ్చలమగు శక్తి.

రథం కదిలి వెళుతూ ఉన్నప్పటికీ

రథికుడు అందులో కదలక కూర్చుని ఉన్నట్లు

భూమి భ్రమణ, పరిభ్రమణంలో ఉన్నప్పటికీ

భూమీమ్మద ఉన్న పర్వతరాజములు స్థిరంగా నిలిచి ఉన్నట్లు

చలనరూపమైన శక్తి (పార్వతి) యొక్క హృదయంలో

సుప్రతిష్ఠుడై ఉన్న అచలాకారుడే శివుడు.

అనగా చలనంలోని నిశ్చలమే శివుడు.

**296.** ప్రశ్న : శక్తి అనగా?

సద్గురు : శక్తి అనగా చలించు శివుడు.
గంభీరమైన సముద్రంలో అంతర్వాహిని ప్రవహిస్తున్నట్లు.

ఎటూ కదలని గోడగడియారంలో లోలకం కదులుతున్నట్లు.

కదలక కూర్చున్న వ్యక్తిలో మనస్సు చంచలమైన ఉన్నట్లు

అచల రూపమైన పరమాత్మలో చలనరూపంగా ఉన్న అతిశయాత్మకమైన విషయమే శక్తి.

అనగా అచలములోని చలనమే శక్తి (పార్వతి).

**297.** పట్టెయ్య : మాయ అంటే?

సద్గురు : ఉన్నట్లుగా అనిపించే లేనిది.

**298.** భాస్కర్ : పంచభూతాలు ఎలా ఏర్పడ్డాయి?

సద్గురు : అవి కేవలం ఈశ్వరుని ఊహా వస్తువులు మాత్రమే.

**299.** హరి : సృష్టి ప్రయోజనమేమి?

సద్గురు : ఎవరికి తెలుసు? సృష్టికి ముందు, తరువాత ఉన్నవాడు ఎవడో వాడికొక్కడికే తెలియాలి ఆ ప్రయోజనం ఏమిటో. మనకేం తెలుసు?....

**300.** పట్టెయ్య : అపరోక్షానుభూతి అంటే?

సద్గురు : ఇప్పుడు – ఇక్కడ – ఇలా (సదా వర్తమానంలో) ఉండడం.

**301.** భారతీలక్ష్మి : గీత చెప్పినవాడూ కృష్ణుడే.
గీత విన్నవాడూ కృష్ణుడే.

సద్గురు : అవునవును. గీత చదివేవాడు కూడా కృష్ణుడే.

**302.** పట్టెయ్య : శ్వాసిస్తున్నది నేను కాదా?

సద్గురు : కాదు. శ్వాసిస్తున్నది భగవంతుడే.
సృష్టిలోని సకల జీవరాశుల శ్వాసలన్నీ ఉపశ్వాసలే.
ఆయన శ్వాస సుదీర్ఘం, అనంతం.

**303.** భాస్కర్ : సృష్టి గమనం ఎటువైపుకు?
ఫలితం ఏమి?

సద్గురు : సృష్టి గమనం నిద్రవైపుకు.
ఫలితం పరమ సుఖం.

**304.** సద్గురు : పెళ్లి వేడుకలో –
పెళ్లి అవుతున్నవారు,
పెళ్లి కానివారు,
పెళ్లి అయినవారు ఉంటారు.
వీళ్లలో ఆ పెళ్లిని వర్తమానంలో
అనుభవిస్తున్నది ఎవరు?

మురుగానంద : పెళ్ళి అవుతున్నవారే...

సద్గురు : అదే విధంగా జ్ఞానం అనేది ఎప్పుడిదో, ఎప్పటికో అని కాకుండా ఇప్పుడే, ఇక్కడే జ్ఞానాన్ని వర్తమానంలో అనుభవించేవాడే జ్ఞాని.

305. ఒకరు : ప్రతి రోజూ గంట సేపు భగవద్ధ్యానం చేస్తున్నాను స్వామీ...

సద్గురు : మిగతా 23 గంటలు దేవుడు నిన్ను ధ్యానం చేస్తుంటాడు.

306. భాస్కర్ : సైన్సు మరియు ఆధ్యాత్మికము అనుసంధానము చేస్తూ చెప్పండి...

సద్గురు : అనుసంధానము చేయడానికి అవి రెండు వస్తువులయితే కదా! అవి ఒకటే.
పంచేంద్రియాలకు అందే ఆధ్యాత్మికం–సైన్స్.
పంచేంద్రియాలకు అందని సైన్స్ – ఆధ్యాత్మికం.

307. ప్రశ్న : స్త్రీలకు మంత్రోపదేశం తీసుకునే అర్హత లేదంటున్నారు. నిజమేనా?

సద్గురు : బ్రహ్మ విద్యకు స్త్రీ పురుష నపుంస భేదాలు లేవు.
అందరూ అర్హులే.
అందరూ ఆత్మలే.

308. ఒకరు : సంపూర్ణ శరణాగతి అంటే?

సద్గురు : రెప్పపాటు కాలం కూడా 'బాబు' ఉండడు.
బాబు రూపంలో ఈశ్వరుడే ఉంటాడు.

నిద్ర నుండి మేలుకోగానే నేను మేలుకున్నాను
అని కాకుండా ఈశ్వరుడే మేల్కొన్నాడు అని ఉండాలి.

ఈశ్వరుడే స్నానం చేస్తున్నాడు.
ఈశ్వరుడే భోం చేస్తున్నాడు.
ఈశ్వరుడే నిద్రిస్తున్నాడు.
ఈశ్వరుడే జీవిస్తున్నాడు...

అని ఉండటమే సంపూర్ణ శరణాగతి.

309. పట్టెయ్య : ఏది స్వధర్మం?
ఏది పరధర్మం?

సద్గురు : 'నేను'గా ఉండడం స్వధర్మం.
'పట్టెయ్య'గా ఉండడం పరధర్మం.

310. ఉమ : ఏ సాధన చేయమంటారు?

సద్గురు : 'ఉమ'గా ఉండకుండా
'నేను'గా ఉండండి.

311. ఒకరు : ముక్తి అంటే?

సద్గురు : తన నుంచి తాను విడిపడడం.

**312.** చిలకమ్మ : ఈరోజు ఒంటరిగా అరుణాచల గిరి ప్రదక్షిణం చేసొచ్చాను స్వామీ...

సద్గురు : అది ఒంటరిగా ఎలా అవుతుంది? అరుణాచలేశ్వరుడు తోడుగా లేడా?

**313.** ఉమ : మీరు మహనీయులండి...

సద్గురు : అని మీరు గుర్తించగలిగారంటే మీరు నాకన్నా గొప్ప మహనీయులు.

**314.** బాబు : మన 'జ్ఞానప్రసూనాలు'లోని వాక్యాలు సాటి మానవుని సుఖదుఃఖాల్లో ఏమాత్రమూ పాలుపంచుకోక చాలా కఠినంగానూ, నిర్దయగానూ ఉన్నాయి...

సద్గురు : పైకి అలా అనిపిస్తుందేగాని, అంతకంటే దయగల వాక్యాలు మరెక్కడా ఉండవు.

**315.** పట్టెయ్య : బ్రహ్మజ్ఞాని యెవరు?

సద్గురు : బ్రహ్మమొక్కటే జ్ఞాని అని ఎఱిగినవాడు.

**316.** ఒకరు : నాకు మోక్షం కావాలి స్వామీ...

తాత : నీ పేరుతో ఎన్ని ఎకరాలు ఉన్నాయి?

ఒకరు : 12 ఎకరాలు స్వామీ...

తాత : ఆ 12 ఎకరాలు నా పేరుతో రిజిస్ట్రర్ చేయించండి. తక్షణమే నీకు మోక్షం వస్తుంది.

(అడిగినవాడు అక్కణ్ణుంచి మెల్లగా జారుకున్నాడు)

* మోక్షం కోరేవాడికి మోక్షం తప్ప ఇక ఏదీ అవసరంగా ఉండకూడదు. అప్పుడు మోక్షం సిద్ధిస్తుంది. అని భావము.

**317.** భాస్కర్ : ఆధ్యాత్మికంగా గ్రహముల యొక్క ఉపయోగమేమి?

సద్గురు : గ్రహములనేవి లేనే లేవు.
అవి కేవలం పేర్లు మాత్రమే.

**318.** ఉమ : ధ్యానం కుదరటం లేదు స్వామీ...

సద్గురు : కుదిరితే అప్పుడు మీరు ఏమిగా ఉంటారు?

ఉమ : మనస్సు నిశ్చలమై ఆనందంగా ఉంటాం కదా!
మనస్సు నిశ్చలంగా ఉండడం లేదు స్వామీ...

సద్గురు : మనసు నిజంగా నిశ్చలమైతే మీరే ఉండరు. మీరే లేనప్పుడు తరువాత పరిస్థితి ఎలా ఉంటే మాత్రం మీకేమి లాభం?

**319.** సద్గురు : "నా భక్తురాలైనవారు నిత్య దరిద్రులైపోతారు"
అని బ్రహ్మంగారు అన్నారు కదా!
ఎందుకలా?

తాతగారు : దానికూడా సిద్ధపడి వచ్చేవాడు ఒక్కడు రానీ చాలు. మనకు గుంపు అవసరం లేదు అని.
అలా సిద్ధపడి వచ్చిన సిద్ధయ్యే సిద్ధి పొందాడు.

**320.** పట్టెయ్య : బ్రహ్మ విద్యకు అర్హత ఏమి?

సద్గురు : తనకు నామరూపములున్నాయి అనుకునే ప్రతి ఒక్కడూ అర్హుడే.

**321.** కాశిరెడ్డి : అర్ధరాత్రి వేళ మా ఇంటి తలుపు గెడియ కదిలించినట్టు శబ్దం వస్తోంది
దెయ్యమోనని భయంగా ఉంది స్వామీ....

సద్గురు : భగవంతుడని ఎందుకనుకోకూడదు?
గెడిని కదిలించే శక్తి భగవంతునికి ఉండదా?

**322.** భాస్కర్ : భగవంతుని గుణములు ఏవి?

సద్గురు : సకల గుణములూ భగవంతునివే.
విషపు కోర వలన పాము బాధింపబడనట్టు వాటి చేత భగవంతుడు బాధింపబడడు. అందువలన గుణ సహితుడు అయినప్పటికీ గుణ రహితుడు అని కూడా చెప్పవచ్చు.

**323.** ప్రసాద్ : తురీయం అంటే?

సద్గురు : జాగ్రత్ – స్వప్న – సుషుప్తులు మూడూ
దేనిలో అయితే ఉన్నాయో అదే తురీయం.

**324.** పట్టెయ్య : అందరికీ జీవిత పరమార్థం ఒకటేనా?

సద్గురు : ఉండేది నీవొక్కడివే.
ఇతరములేదు, ఇతరులు లేరు.

325. బాబు : నేను శాశ్వతుడినా? అశాశ్వతుడినా?
సూటిగా చెప్పండి.

సద్గురు : నీవు ధ్యానించే వస్తువు
అశాశ్వతమైనదైతే
నీవు అశాశ్వతుడవు.

నీవు ధ్యానించే వస్తువు
శాశ్వతమైనదైతే
నీవు శాశ్వతుడవు.

326. బాబు : అఖండ దీపం అంటే?

సద్గురు : హృదయంలో నేను - నేను అన్న ఎడతెగని అహంస్ఫురణయే అఖండ దీపం.

327. ప్రశ్న : గృహస్థాశ్రమ ధర్మం ఏమిటి?

సద్గురు : భగవంతుడే తన కుటుంబరూపంగా ఉన్నాడని తెలిసి, తనవాళ్లకు ఉచిత రీతిన సేవలు చేయడం.

328. పట్టెయ్య : గురువు భౌతికంగానే ఉండాలా?

సద్గురు : నీకు గుణపాఠం నేర్పే ప్రతీది గురురూపమే.

329. చిలకమ్మ : భయం భయంగా ఉంది స్వామీ....

సద్గురు : భయం లేని ఒక్కడే
వాణ్ణే ఈశ్వరుడు అని మనం అనేది.

ఇక పంచభూతాల కాడ నుంచి
సకల జీవరాశుల వఱకు
భయంతోనే మనుగడ సాగిస్తున్నాయి.

అభయ స్వరూపుడైన అరుణాచలేశ్వరుణ్ణి
నమ్ముకున్నావు. ఇంకా భయమెందుకు?

**330.** పట్టెయ్య : గురువుకు శుశ్రూషలు చేయడం ఎలా?

సద్గురు : అది అసంభవం.

వైద్యుడే రోగికి శుశ్రూష చేయగలడే గాని
రోగి వైద్యునికి కాదు.

గురువు శిష్యుడికి చేసేదే నిజమైన శుశ్రూష.

**331.** భాస్కర్ : స్వభావానికి, స్వధర్మానికి తేడా ఏమి?

సద్గురు : రెండూ ఒకటే.

స్వభావాన్ని అనుసరించే స్వధర్మం ఏర్పడుతుంది.
నీళ్లు కంటే నెయ్యి గొప్పదే.

అలా అని చేప నీటిని వదిలి
నేతిలో అవి జీవించలేవు.

ఈ సూత్రం ప్రకారం ప్రతి ఒక్కరూ
స్వభావంలోనే ఉన్నారు, స్వధర్మంలోనే ఉన్నారు.
'స్వధర్మాన్ని ఆచరించు' అని ప్రత్యేకించి బోధలు
చేయవల్సిన అవసరం లేదు.

332. సద్గురు : భూమి దానికదే తిరుగుతోందా?
మనం కష్టపడి త్రిప్పుతున్నామా?

బాబు : దానికదే తిరుగుతోంది.

సద్గురు : కానీ మనమే కష్టపడి త్రిప్పుతున్నాం అన్నంత ఫీలింగులో వుంటాం ప్రతి విషయంలోను.

సృష్టిలో ప్రతీది దేనికది సహజంగా
జరుగుతున్న దానిని పట్టుకుని 'నేనే
చేశాను, నా వల్లనే జరిగింది' అన్న
భ్రాంతిలో కొట్టుమిట్టాడుతుంటాము.

333. పట్టెయ్య : వానప్రస్థుడు ఇంటి వద్దనే ఉండవచ్చునా?

సద్గురు : వానప్రస్థుడికి ప్రపంచమే తన ఇల్లు.
కాబట్టి ఎక్కడైనా తాను ఉండవచ్చు.

334. పట్టెయ్య : బ్రహ్మచారి భిక్షాటన చేసి జీవించాలా?

సద్గురు : భిక్షాటన చేసైనా విద్యను అభ్యసించాలి.
భిక్షాటన చేసైనా విద్యను పంచాలి.
భిక్షాటన చేసైనా విద్యను బ్రతికించాలి.
ఆ దివ్యమైన ఆశయానికి సంసిద్ధుణ్ణి
చేయడానికే 'భిక్షాటన' అనే తంతు.

* * *

భిక్షకు, యాచనకు అదే తేడా.
విద్య కోసం చేసేది భిక్ష.
కేవలం బ్రతకడానికి చేసేది యాచన.

**335.** ప్రసాద్ : దేవుణ్ణి త్రికరణశుద్ధిగా ధ్యానించాలి.

సద్గురు : త్రికరణాలు శుద్ధంగా ఉంటేచాలు.
ధ్యానించవలసిన అవసరం ఉండదు.
నీవే దేవుడిగా ఉంటావు.

**336.** పట్టైయ్య : బ్రహ్మానందమంటే?

సద్గురు : నేను కేవలం ఈ పట్టైయ్యను మాత్రమే కాను అని ఉండడం.

**337.** పట్టైయ్య : కర్త ఈశ్వరుడే. మరి నేనేమీ చేయడం లేదా?

సద్గురు : రాజాస్థానంలో పనిచేసే రాజోద్యోగి స్వయంగా తానే అన్ని పనులను నిర్వహిస్తున్నట్టు కనబడినా ఆ నిర్వహణలో అంతర్లీనంగా రాజ ఉత్తర్వు ఉంటుంది. అట్లే జీవుల స్వేచ్ఛాసంకల్పముతో కూడిన సకల కర్మలు కూడా 'పరా'ధీనములే. సందేహము లేదు.

**338.** సద్గురు : సత్యమనేది ఎవడి అనుభవంలోకి రాదు
వస్తే అది సత్యం కాదు.

బాబు : సత్యాన్వేషణ అనేది అర్థం లేనిదన్నమాట...

సద్గురు : అని తెలియడమే సత్యాన్వేషణ ఫలితం.

**339.** భాస్కర్ : సృష్టికి మూలకారణమెవరు?

సద్గురు : నీవే.

నిద్రలో సృష్టి బీజరూపంలో ఉంటుంది.

అదే కలగా, మెలకువగా విస్తరిస్తుంది.

**340.** ప్రశ్న : మౌనభాషణం అంటే?

సద్గురు : మౌనంలో నుంచి భావం పుట్టింది.

భావంలో నుంచి నాదం పుట్టింది.

నాదంలో నుంచి భాషణం పుట్టింది.

మౌనం – ఆత్మ.

భావం – మనసు.

నాదం – జగత్తు.

భాషణం – వ్యక్తి.

**341.** సద్గురు : 'ఒకటి' అనేది ఏ మతానికి సంబంధించినది?

బాబు : అందరికీ సంబంధించినది.

సద్గురు : కాబట్టి 'దేవుడు ఒక్కడే' అనేది కాదు,

'ఒక్కటి' అనేదే దేవుడు.

**342.** ప్రశ్న : నేనెవడను?

సద్గురు : ఆద్యంతములు లేని వర్తమానమే నేను.

343. రజనీ : 'నేను' ఒకటే సత్యం.
సాధనలన్నీ అసత్యం...అన్నట్టుగా ఉంటాయి
మీ బోధలన్నీ...
మరి లౌకికమైన భార్యాభర్తల సంబంధాలు...
పారమార్థికమైన గురుశిష్యసంబంధాలు...
వేదాలు, పురాణాలు, సాధనలు...
ఇవన్నీ ఎందుకండీ...?

సద్గురు : అవసరం లేదు.

అని తెలుసుకుని, అన్నీ అవసరమే అన్నట్టు వ్యవహరించాలి.

"బాహ్యంలో సంగం-అంతరంలో నిస్సంగం".
ఇదే సర్వ వేదాంతసారం.

344. రవివర్మ : ఆత్మలో నిలకడగా ఉండలేకపోతున్నాను స్వామీ...!

రామకృష్ణులు, రమణులు మొదలైనవారు సదా ఆత్మ నిష్ఠలో ఉండేవారు కదా!... అలా ఉండాలని నా కోరిక.

సద్గురు : వారు ఉండలేదు. ఉంచబడ్డారు.

345. దాము : గోపాల్‌బాబాగారు దేవుడిలో కలసిపోయారు స్వామీ...

సద్గురు : గోపాల్ బాబా దేవుడని జనులు కొలుస్తుంటే, మళ్లీ ఆయన దేవుడిలో కలవడమేమిటి?

**346.** ప్రశ్న : భగవంతుడు కోటి సూర్య ప్రకాశమంటారు కదా!

సద్గురు : బావిలో కప్పకు "సముద్రమంటే కోటి బావులంత" అని చెప్పినా అర్థం కాదు.

వ్యక్తికి "భగవంతుడంటే, కోటి సూర్యులంత" అని చెప్పినా అర్థం కాదు.

చేప సముద్రం చేరాలి.
వ్యక్తి భగవంతుడు అవ్వాలి.

అనగా
"తానే" ప్రకాశం అవ్వాలి.

**347.** సద్గురు : విష్ణువు చేతిలో చక్రం
శివుని చేతిలో శూలం
ఉండటం కేవలం అలంకార ప్రాయమే.

ఇంతవరకు వాటిని వారు ఉపయోగించిందే లేదు.
ఉపయోగించాలంటే తమకు అన్యం ఉండాలి కదా!

బాబు : కొన్ని పురాణ గాథల్లో వాటిని ఉపయోగించినట్లు ఉంది కదా!

సద్గురు : ప్రయోగిస్తే ఆ విష్ణువు విష్ణువూ కాదు. ఆ శివుడు శివుడూకాదు.

348. పట్టెయ్య : ముక్తికి సిద్ధులు ఆటంకమా?

సద్గురు : నామ రూపాలు లేని "తాను"
నామ రూపాలు కలిగిన పట్టెయ్యగా
ఉండడమే తొలిసిద్ధి.
'పట్టెయ్యే' ప్రధాన ఆటంకం ముక్తికి.

349. పట్టెయ్య : అంతర్వీక్షణం అంటే ఏమి?
పట్టెయ్యకు లోపల చూడమని అర్థమా?

సద్గురు : కాదు కాదు. 'లోపల' అంటే పట్టెయ్యకు లోపల అని కాదు.
లోపల అసలు పట్టెయ్యకు,ప్రపంచానికి ఉనికే లేదు.
దానిని 'పట్టెయ్య లోపల' అని ఎలా అనగలం?

అంతర్వీక్షణం అంటే,
పట్టెయ్య, ప్రపంచము లేని
'కేవల సాక్షి'గా నిలబడమని అర్థం.

350. బాబు : దైవీ స్థితి అంటే?

సద్గురు : వందరూపాయలు చేతిలో ఉంటే
ఒక్క రూపాయి అష్ఫాల్ అవుతుంది.

లక్ష రూపాయిలు చేతిలో ఉంటే
వంద రూపాయలు అష్ఫాల్ అవుతుంది.

ఏదేది చెప్పటానికి వీలున్నదో
ఏదేది తలవడానికి వీలున్నదో
ఆ ఉన్నదంతా కలిపి నీకు ఎప్పుడు ఆబ్స్ట్రాక్ట్
అవుతుందో అప్పుడున్న నీ స్థితియే దైవీస్థితి.

**351.** ఒకరు : కోటీశ్వరులు అని పేరే గాని
నిజానికి వారికి సుఖమెక్కడిది?

సద్గురు : అవునవును. శిక్షలు రెండు రకాలు –
**1.** నెగిటివ్ శిక్షలు.
**2.** పాజిటివ్ శిక్షలు.

**352.** దాము : బీజాక్షరాలను పలికేటప్పుడు
ఉచ్ఛారణ సరిగ్గా ఉండాలని అంటారు కదా...!

సద్గురు : ఉయ్యాల్లో బిడ్డ ఏడ్చే ఏడుపులో ఏ వ్యాకరణం ఉంది?
తల్లి పరుగున వచ్చి తన గుండెలకు హత్తుకుంటుంది కదా!
అలా ఏడవాలి తాను భగవంతుని కొఱకు.
అంతేగాని ఛందస్సు, ఉచ్ఛారణ, వ్యాకరణము ప్రాసలు ఇవేవీ చూడదు భగవంతుడు.

**353.** మురుగానంద : పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస అంటే ఏమి స్వామీ...!

సద్గురు : నీవు పుట్టక ముందున్న స్థితి – పూర్వ మీమాంస.
నీవు గిట్టిన తర్వాత ఉన్న స్థితి – ఉత్తర మీమాంస.

354. బాబు : గురువుగారూ! ఈ రోజు అరుణాచల కృత్తిక దీపోత్సవం. కొండ మీద దీపం వెలిగిస్తారు...

సద్గురు : అరుణాచలం మీద దీపం ఉండడం కాదు, దీపం ఎక్కడుంటే దాని క్రింద అరుణాచలం ఉంటుంది.

355. బాబు : అపరోక్షం అంటే?

సద్గురు : తానుంటేనే ప్రత్యక్షమైనా, పరోక్షమైనా ఉండేది.
కాబట్టి తానే అపరోక్షం.

356. సద్గురు : ఆకాశానికి కాపీరైట్స్ ఉన్నాయా?

బాబు : లేవు.

సద్గురు : భగవంతునికి కూడా కాపీరైట్స్ లేవు.

బాబు : వాడు అందరి సొత్తు అన్నమాట . . .

సద్గురు : ఎవరి సొత్తూ కాదు కూడా.

357. బాబు : భగవంతుడు జగుత్తును ఎందుకు సృష్టించాడు?

సద్గురు : అలా అని భగవంతుడు వచ్చి నీకు చెప్పాడా?
నువ్వే అంటున్నావు.
నిజానికి నీ సృష్టే భగవంతునితో సహా.

* * *

ఆటను నువ్వే కల్పించావు.

గీతలు గీసుకున్నావు.

గీత దాటితే ఓటమి అంటున్నావు.

ఓడితే బాధడుతున్నావు.

గెలిస్తే సంతోషిస్తున్నావు.

ఎందుకు? అన్న ప్రశ్నకు ఇదే సమాధానం –

ఇది నువ్వు స్వయంగా కల్పించుకున్న ఆట.

358. బాబు : ఆట ఎందుకు?

సద్గురు : నిన్నెవరు ఆడమన్నారు? ఆపెయ్యి.

బాబు : ఇది నేను కల్పించుకున్న ఆట అని నాకెందుకు గుర్తులేదు?

సద్గురు : అంతగా ఆటలో మైమరచి ఉన్నావు.

మేలుకో – మేలుకో అని వేద ఋషులు అన్నారంటే,

ఇదొక ఆట అనేది సదా జ్ఞప్తిలో ఉంచుకో అని అర్థం.

359. బాబు : పాము – అసత్యము

త్రాడు – సత్యము

జగుత్తు – అసత్యము

బ్రహ్మము – సత్యము అని తేల్చేస్తున్నాము.

నిజంగా సమస్య అంతటితో తీరిపోతోందా? లేదు.

ఎక్కడ పొరబాటు చేస్తున్నాం?

సద్గురు : ఉల్లి పై పొరను తీసివేసినంత మాత్రాన అది ఉల్లి కాకుండా పోతుందా? భ్రాంతి పై పొరను తీసివేసినంత మాత్రాన అది భ్రాంతి కాకుండా పోతుందా? మనం చేస్తున్న పొరబాటు ఇదే. పాము భ్రాంతి అని తెలుసుకున్నాం. అందువల్ల త్రాడు సత్యము అని తేల్చేసి ఊరక ఉండి పోతున్నాం. మనం ఇప్పుడు ముఖ్యంగా తెలుసుకోవాల్సింది త్రాడు కూడా భ్రాంతియే అన్నది.

త్రాడుగా ఉన్నదేది?

అది ఏదో మనకొద్దు.

మనం చేయవల్సిందల్లా 'ఇది సత్యము' అని నిర్ధారణకు వచ్చిన ప్రతిసారి 'ఇదికాదు' (నేతి) అన్న అస్త్రాన్ని వదలడమే.

సర్పము - నేతి, రజ్జువు-నేతి,జగత్తు - నేతి, బ్రహ్మము - నేతి,

నేతి - నేతి - నేతి - నేతి అన్నదే వేదాంతం భేరి.

**360.** బాబు : ఆత్మ స్వరూపమంటే?

సద్గురు : మెలకువ రాక మునుపు ఉన్న తన స్వరూపమే.

బాబు : ఈ వేదాంతం వలన ముఖ్య ప్రయోజనమేమి?

సద్గురు : ఉన్నదెల్లా ఉన్నట్లున్నదిగా మారుకుంటుంది.

**361.** ఒకరు : స్వామీ! నేను రుద్రాక్షను ధరించవచ్చా?

సద్గురు : ధరించవచ్చు.

'నన్ను రుద్రాక్ష ధరించి ఉంది'

అన్న ఎరుకలో.

**362.** బాబు : మారు మనస్సు పొందడం అంటే?

సద్గురు : బ్రహ్మాచారులుగా ఉన్న ఓ ఆడ-మగ మూడుముళ్లు పడగానే భార్య-భర్తగా అయిపోతారు. నిజంగా ఆ వ్యక్తుల్లోకి భార్య-భర్త అనే మరో వ్యక్తులు వచ్చి జొరబడ్డారా? లేదు. నిజంగా మార్పు లేదా? అంటే, ఉంది.

తరువాత వారికి ఒక బిడ్డ కలుగగానే తల్లి - తండ్రి అనే మార్పు సంభవిస్తోంది.

అలాగే వ్యక్తి ఈశ్వరుడై పోవడం కూడా.

బాహ్యానికి పూర్వపు వ్యక్తిలాగే గోచరించవచ్చు. కాని వాని అనుభవంలో 'నేను ఈశ్వరుడు' అన్న అనుభవం ఉంటుంది.

**363.** బాబు : నేను ఎలా ఉండాలి?

సద్గురు : 'నేను'గా ఉండాలి.

'బాబు'గా ఉన్నట్లు ఉండాలి.

**364.** బాబు : 'నేను' యొక్క అర్థమేమి?

సద్గురు : 'ఒకటి' (ఏకము)

**365.** బాబు : మతం అవసరమా?

సద్గురు : దేవుణ్ణి పొందటానికి అవసరమైనది "ఆర్తి" మతం కాదు.
మతం వల్ల దేవుణ్ణి పొందినవాడు ఎవడూ లేడు చరిత్రలో.
విధ్వంసం తప్ప.

**366.** చిలకమ్మ : ఒక స్వామి గొప్పవాడని ఆరాధించాము.
చివరికి అతడు మంచివాడు కాదని తెలిసింది...

సద్గురు : ఒక్క భగవంతునిలో తప్ప ఇంకెవరిలోను సుగుణాలను ఎదురుచూడవద్దు.

**367.** లక్ష్మి : నాలో చాలా విచారణ పెరిగింది.
నాలో మార్పు నాకు తెలుస్తోందండి.

సద్గురు : సంతోషం.
భగవంతుని వైపుకు మీ అడుగులు పడుతున్నాయి.

**368.** లక్ష్మి : ఎక్కడికీ వెళ్లాలనిపించడంలేదు,
మౌనంగా ఉండిపోవాలనిపిస్తోంది.

సద్గురు : సత్సంగాలకు ఎక్కడకీ వెళ్లొద్దు.

ఉన్నచోటనే ఉండండి హాయిగా.

అదే నిజమైన సత్సంగం.

భర్తను బాగా చూసుకోండి.

అదే నిజమైన భగవత్సేవ.

నిజానికి ఈ ప్రపంచంలో మనం పొందవలసింది అంటూ ఏమీ లేదు.

కమర్షియల్ ఆశ్రమాలు,

కమర్షియల్ స్వాములు

చెప్పే మాటలు -

'పొందాలి' అని.

'ఏదో చేయాలి' అని.

వాటి మాయలో పడొద్దు.

నేను ఏమీ చేయక పోయినా సరే

'నేను భగవంతుని బిడ్డను' అని దబాయించి చెప్పండి.

**369.** సుబ్బారాయుడు : నాదంటూ ఏమీ లేదు.

నా పిల్లలకు మొత్తం ఇచ్చివేశాను...

సద్గురు : నీ కొడుకు బంగారు చైన్ ధరిస్తే,

నీవు ధరించక పోయినా నీవు ధరించినట్లే.

నీవు యెంత నిరాడంబరంగా కనిపించినా
నీ ఫ్యామిలో ఎవరు ఆడంబరంగా ఉన్నా
నీవు ఆడంబరంగా ఉన్నట్లే.

నీకు కలిగినదంతా నీవాళ్లకు ఇచ్చి వేసి
నీవు పూర్తిగా ఖాళీ అయిపోయినా సరే
నీవు కలిగిన వాడివే.

నాపాదాలకు చెప్పులిచ్చేశాను,
నాకాళ్లకు ఫ్యాంటు ఇచ్చేశాను,
నా వంటికి చొక్కా ఇచ్చేశాను,
నా రిస్టుకు వాచీ ఇచ్చేశాను,
నా కళ్లకు కళ్ల జోడు ఇచ్చేశాను అన్నట్లుంది.
ఇవన్నీ నీకు నీవు ఇచ్చుకున్నట్లే కదా!
'నీవు' అంటే నీ వొక్కడివే కాదు. 'నాది' అని నీవు
అనుకున్నదంతా కలిపితే ఆ మొత్తమే నీవు.

**370.** భార్గవి : రాత్రిళ్లో నిద్రరావడం లేదు స్వామీ...
సద్గురు : శివ శివ అని స్మరించుకుంటూ ఉండు.
నిద్ర దాని పాటికి అదే వస్తుంది.

**371.** పట్టెయ్య : సద్గురు సత్సంగం యొక్క ముఖ్య ప్రయోజనం ఏమి?
బాబు : **1.** సద్గురువు ద్వారా మాట్లాడేది నేనే.
**2.** నా ద్వారా మాట్లాడేది సద్గురువే.

ఈ రెండు అనుభవాలు కలగడమే
సద్గురు సత్సంగం యొక్క ముఖ్య ప్రయోజనం.

372. ఒకరు : ప్రతి రోజూ ఓ గంట ధ్యానం సరిపోతుందా స్వామీ?

సద్గురు : ఓ మల్లెపువ్వు పెట్టి, దాని చుట్టూ
ఎండలు చేపలు పెడితే అది
ఏ వాసన వస్తుంది?

ఒకరు : ఎండు చేపలవాసనే.

సద్గురు : ఇదీ అంతే.
నీవు చేసే గంట ధ్యానం
మల్లె పూవులాంటింది.

మిగతా లౌకిక వ్యవహారానికి వినియోగించే
గంటలు ఎండు చేపలు లాంటివి.

నీ జీవితమే ధ్యానంగా మారుకోవాలి.

అందులో నిత్యవ్యవహారం 'మైమఅపు'గా
సాగిపోవాలి.

373. ఒకరు : ఎందుకీ ప్రపంచం ఇంత అరాచకంగా
తయారయ్యింది?

సద్గురు : ఇది కలియుగం. దాని లక్షణములను అనుసరించే
ప్రపంచం ఉంటుంది.

కలియుగంలో కృతయుగ లక్షణాలను ఆశిస్తే ఎలా?
కలియుగంలో ఎవరు ఏది ఎలా ఉండాలో
అలానే ఉన్నారు, అలానే ఉన్నది.

**374.** పట్టెయ్య : మీరు సిద్ధ పురుషులు...

బాబు : అవునవును నేను సిద్ధ పురుషుణ్ణే.
వినటానికి, తెలుసుకోవడానికి నేనెప్పుడూ సిద్ధంగా ఉంటాను కదా...!

**375.** రామాంజనేయులు : తమరి గ్రంథాలను చదివిన తర్వాత ఇక ఏ గ్రంథాలూ చదువ బుద్ధి కావట్లేదు స్వామీ.

సద్గురు : 'నా భక్తులైనవారు నిత్యదరిద్రులై పోతారు'
అన్న బ్రహ్మంగారి మాటకు అర్థం ఇదే.
అన్నీ ఉండీ, ఏమీలేనివాడవుతాడు.
అంటే సాక్షాత్తు భగవంతుడే తానవుతాడు.

**376.** బాబు : మన 'జ్ఞాన ప్రసూనాలు' చదివిన వారికి
'నాకూ వేదాంతం తెలుసు' అన్న అనుభూతి కలుగుతుంది...

సద్గురు : కాదు కాదు.
'నాకు తెలిసిందే వేదాంతం' అన్న అనుభూతి కలుగుతుంది.

**377.** ఒకరు : జపం అక్షరలక్షలు చేస్తే మంత్ర సిద్ధి అవుతుందా? మామూలుగా కౌంట్ చేయకుండా చేస్తే మంత్రసిద్ధి కాదా?

సద్గురు : మీ అమ్మగారిని, నాన్నగారిని రోజుకి ఇన్ని సార్లు అమ్మా! అని పిలిచానని, ఇన్నిసార్లు నాన్నా! అని పిలిచానని లెక్కలు ఏమైనా వేసుకుంటున్నావా? భగవంతుడు పరమ తండ్రి.

ఆయన విషయంలో మాత్రం లెక్కలు ఎందుకు?
నోరు నొప్పి పుట్టేవఱకు జపించు.
ప్రేమలో లెక్కలు ఉండవు.

**378.** బాబు : దేవుడు జగత్తును ఎందుకు సృష్టించాడు?

సద్గురు : కార్య కారణ నియతికి అతీతమైన దాని విషయంలో కారణమేమని ప్రశ్నిస్తున్నావు.

ప్రశ్నే తప్పు.

బ్రహ్మమొక్కటే సత్యము.
జగత్తు భ్రమ మాత్రమే.

అల – కార్యము.
సముద్రము – కారణము.

అయినా రెండూ నీరే అయినట్లు
భ్రమకు మరో భ్రమే కారణము.

'దెయ్యము' అన్న భ్రమ చేత భయపడినవానికి
'దేవుడు' అన్న మరో భ్రమ చేత భయాన్ని
పోగొట్టినట్లు,

భ్రమను మరో భ్రమ చేతనే నశింప చేయాలి.
సాధనలన్నీ భ్రమరూపాలే.

సాధనలు సత్యాన్ని పొందటానికి కాదు,
భ్రమను తొలగించటానికే.

సత్యము సదా ముక్తము.
సదా శుద్ధము.
సదా సిద్ధము.

ఆ అద్వితీయమైన స్థితిలో జగత్తే లేదు.
'ఎందుకు' అన్న ప్రశ్నకు అసలు తావే లేదు.

**379.** ఒకరు : వాచా వేదాంతం పనికిరాదు...
ఆచరణలో ఉండాలి...

సద్గురు : ఆచరణకు వీలైనది ఆచారం.
ఆచరణకు వీలుకానిది వేదాంతం.

నీతి సూత్రాలను ఆచరించగలం,
ఆచరించాలి కూడా.
ఆత్మ సూత్రాలను ఆచరించలేం, అనుభవించగలం.

"ప్రక్కవాడికి ఇబ్బంది కలిగించకుండా జీవించు"
ఇది నీతి సూత్రం.
దీనిని ఆచరించగలం, ఆచరించాలి కూడా.

"ఉన్నది ఆత్మ ఒక్కటే. రెండవ వస్తువు లేదు."
ఇది ఆత్మసూత్రం.
దీనిని ఎలా ఆచరించగలం?
ఇది కేవలం అనుభవ విషయం.

**380.** బాబు : ఉపాసన అంటే?

సద్గురు : తనువు లోపల మాత్రమే ఉన్న తాను
తనువు లోపల - బయట నిండి ఉన్న తానుగా
మారుకునే ప్రాసెస్సే ఉపాసన.

**381.** ఒకరు : పునర్జన్మ గురించి సనాతన ధర్మంలో తప్ప మరెక్కడా
ఆ ప్రస్తావన లేదు.
పునర్జన్మలున్నాయా? లేవా?

సద్గురు : అదొక తలనొప్పి సిద్ధాంతం.
జననం - మరణం అనేవి
ఎవరికీ అనుభవంలో లేవు.
కాబట్టి అవి ఎవరికీ లేవు.
అంతవఱకు అర్థం చేసుకుంటే చాలు.

**382.** హిందీసార్ : పొన్నారావు చనిపోయాడు...

సద్గురు : పొన్నారావు చనిపోయాడు అనేదీ ఒట్టిదే.
మనమంతా బ్రతికున్నాం అనేదీ ఒట్టిదే.

**383.** మురుగానంద : పాప పుణ్యములు గురించి
చెప్పండి స్వామీ...

సద్గురు : నీకు వెలుపల జరిగే పాప పుణ్యములు
రెండూ పాపమే.

నీకు లోపల జరిగే పాపపుణ్యములు
రెండు పుణ్యమే.

తనకు అన్యము లేని స్థితియే దైవీస్థితి.

వెలుపల – లోపల కలిగిన
మురుగానందనే తనలో కలిగి
ఉన్నప్పుడు అక్కడ 'వెలుపల'
ఉండదు. అదే ఏకత్వము.

**384.** చిలకమ్మ(ఓ రోజు) : గురువుగారూ!
నేను జ్వరంతో బాధపడుతున్నాను.

సద్గురు : అరుణాచలేశ్వరుణ్ణి స్తోత్రం చేయమ్మా...
తగ్గిపోతుంది...

చిలకమ్మ : (మరో రోజు) : గురువు గారూ! నాకు జ్వరం
ఇంకా తగ్గలేదు...

సద్గురు : ఇక ఒకటే మార్గం...
అరుణాచలేశ్వరుణ్ణి నోటికొచ్చినట్టు తిట్టు... తగ్గిపోతుంది...

(ఆశ్చర్యం!!! చిలకమ్మకు జ్వరం తగ్గిపోయింది)

385. నూకరత్నం : తండ్రీ! మా గ్రామానికి వచ్చి కూడా మా ఇంటికి రాకుండా వెళ్లిపోతున్నారు. . . .

సద్గురు : ఈ తండ్రిని నీవు నిజంగా అర్థం చేసుకొని ఉంటే, నీవు ఈ మాట అని ఉండే దానివి కావు.

386. ప్రసాద్ : పీడకలలు అంటారే...

సద్గురు : పీడకలలు, మంచి కలలు అని రెండు లేవు. కలే పీడ.

387. బాబు : భగవంతుణ్ణి అస్సలు తలవకపోవడమే భగవంతుణ్ణి బాగా తలచినట్టు అన్నారు మీరు వివరించండి...

సద్గురు : భగవంతుడు అంటే ఫలానా అని ఒక నిర్ధారణ (Conclusioin)కు రాలేదు ఎవరూ ఇప్పటి వఱకు.

ఇక భగవంతుణ్ణి ఏమని తలుస్తారు? కొలుస్తారు? భగవంతుని గురించి ఏఆలోచనా లేకపోవడమే ఆయనకు నిజమైన నిర్వచనం అవుతుంది.

**388.** ప్రశ్న : ఉపాసన అంటే?

సద్గురు : ప్రక్క ఊళ్లో జరిగే ఉత్సవాలకు వెళ్లి
చీకటిపడేలోపు తిరిగి ఇంటికి చేరుకున్నట్లుగా

ఈ ప్రపంచమనే ఉత్సవానికి తరలి వచ్చాం.
మరణించేలోపు తిరిగి స్వస్వరూపమైన
పరమపదానికి చేరే ప్రయాణమే ఉపాసన.

**389.** బాబు : కొందరు పాఠకులు ముఖ్యమైన వాక్యాలకు
అండర్‌లైన్సు చేస్తుంటారు...

సద్గురు : అండర్ లైన్సు యొక్క అర్థమేమంటే -
ఆ వాక్యాలు మాత్రమే తనకు అర్థమైనాయి,
మిగతా అర్థం కాలేదు అని అర్థం.
అంతేగాని అవి మాత్రమే ముఖ్యం అని కాదు.

**390.** పట్టెయ్య : లలితా సహస్రనామాల్లో కొన్ని
అచ్చు తప్పులున్నాయి స్వామి...

సద్గురు : లలితమ్మలో తప్పులుండవు కదా!
మనలో కూడా తప్పులు లేకపోతే సరి.
మనం ఎట్లా చదివినా
అమ్మకు ఒప్పుగానే వినబడుతుంది.

**391.** ముద్దాయి : నేను తప్పు చేయడం భగవదిచ్ఛ...

న్యాయమూర్తి : అవునవును. నేను శిక్ష
విధించడం కూడా భగవదిచ్ఛ.

392. సద్గురు : 1. పండితుడు, 2. పామరుడు, 3.మౌని
3. మూగవాడు, 5.మితభాషి, 6.అతిభాషి.
వీరందరూ ఒక్కసారిగా నీటిలో మునిగి
పోయారనుకో వారి స్థితి అందరిదీ ఒకటేనా?
వేఱు వేఱా?

బాబు : అందరిదీ ఒకటే.

సద్గురు : అలా దైవ సన్నిధిలో వీరందరి స్థితి ఒకటిగానే ఉంటుంది.
ఆ స్థితిని 'మహామౌనం' అని చెప్పవచ్చు.

393. ఒకరు : భయం భయంగా ఉంది స్వామీ...
కారణమైతే ఏమీ లేదు...

సద్గురు : ఓ తెల్ల కాగితం తీసుకుని అందులో ఇలా వ్రాయి- ఓ యమధర్మరాజా! నీవు ఎప్పుడు పిలిస్తే అప్పుడు నీ వెంట రావడానికి నేను సదా సిద్ధం. అని వ్రాసి క్రింద సంతకం పెట్టి, ఆ అప్లికేషన్‌ను కర్పూరంతో కాల్చివేయి. ఆ అప్లికేషను యమధర్మరాజు గారికి చేరుతుంది. నీకు భయం పోయి, నిశ్చింత ఏర్పడుతుంది. మృత్యుభయం పోయాక, ఇక ఏ భయాలూ ఉండవు.

**394.** ఒకరు : విగ్రహారాధన సబబేనా?

సద్గురు : విగ్రహారాధన చేయనివాడెవ్వడు?
తన శరీరానికి కూడా విగ్రహం
అని పేరు. పొద్దున పళ్లు తోమడం
నుంచి రాత్రి పడుకునే వరకు
సదా ఈ శరీరానికి (విగ్రహానికి)
సేవ (ఆరాధన) చేస్తూనే ఉన్నాడు.
విగ్రహారాధన మాను అని పెద్దలు చెప్పింది.
ఈ శరీరమే తాను అనే భావన మాను అని.
అంతే గాని దేవుని విగ్రహాలను
ఆరాధించడం మాను అని కాదు.

**395.** కృష్ణయ్య అనే గురు భక్తుడు తనకు తానే
"జ్ఞానశ్రీ" అనే బిరుదును పెట్టేసుకున్నాడు...

సద్గురు : ఏం కృష్ణయ్యా! నిజంగా నీవు జ్ఞానివా?

కృష్ణయ్య : అబ్బే...! అదేమీ లేదండీ...

సద్గురు : అయితే ఆ బిరుదు నీకు సరియైనదే.
జ్ఞానిని కాదన్న విషయాన్ని గ్రహించావు కాబట్టి.

**396.** సద్గురు : అమావాస్య రోజున చంద్రుడు ఉంటాడా?

బాబు : భూమి వైపు నుంచి చూస్తే ఉండడు గాని
చంద్రునివైపు నుంచి చూస్తే చంద్రునికి
తానున్నాడు కదా!

సద్గురు : అలానే మన అనుభవం నుంచి చూస్తే
ఈశ్వరుడు ఉండడు గాని
ఈశ్వరునికి తానున్నాడు కదా!

397. చిలకమ్మ : నేను ప్రయాణిస్తున్న రైలు కాళహస్తి మీదుగా రాగానే, మీ సన్నిధిలో కాసేపు గడిపి వెళుతున్నట్టుగా అనిపించింది స్వామీ...

సద్గురు : "అనిపించడం" అనేదే సరి.
అన్నీ అలాగే "అనిపించాలి".

398. సద్గురు : 'స్వానుభవం' అనేది
ఏ ఇద్దరికి ఒకే రకంగా ఉంటుందా?

బాబు : ఉండదు.

సద్గురు : ఉండదు, ఉంటుంది.
రెండు సమాధానాలూ కరెక్టే.
"నేను" వఱకే తీసుకుంటే ఒకటే.
"నేను"ను దాటితే వేఱు వేఱు.

399. రాజు : నేనెలా ఉండాలి?

సద్గురు : నీ వరకు నీవు 'నేను'గా ఉండు.
వ్యవహారంలో 'రాజు'గా ఉండు.

400. ప్రశ్న : ఆదిశంకరులు హిందువా?

సద్గురు : శంకరులను పనిగట్టుకుని హిందువుని చేశారు.

మనది సనాతన ధర్మం.

'మతం' కాదు.

'హిందూ మతం' అనే పేరు

చాలా సంకుచితమైనది.

సనాతన ధర్మం ఏ మతస్తుణ్ణి అయినా

తన కౌగిలిలోకి తీసుకుంటుంది.

సనాతన ధర్మం యొక్క వయసును

తన వయస్సుగా చెప్పుకుంటోంది

హిందూమతం.

శిల వయసును తన వయస్సుగా

శిల్పం చెప్పుకున్నట్లు.

* * *

ఏదో ఒక మతస్తుడిగా పుట్టడం అనేది సహజం.

కానీ అదే మతస్తుడిగా చనిపోవడం దురదృష్టకరం.

అందరూ మతాతీతులు కావాలన్నది

ప్రతి మతం యొక్క హృదయం.

401. రాజు : మనసుకు శాంతి లేదు స్వామీ...!

సద్గురు : మనసుకు శాంతి ఉండడం కాదు,

శాంతికి మనసు ఉంటుంది.

**402.** పట్టెయ్య : కనేదంతా కలవరింత

పలికేదంతా పలవరింత

అని పలుమార్లు మీరు చెప్పి ఉన్నారు...

ఈ ప్రపంచం ఇంత సత్యంగా కనిపిస్తుంటే,

కలవరింత – పలవరింత అని

అనుకొనవలసిన

అగత్యమేమి?

సద్గురు : నీకు అన్యంగా ప్రపంచాన్ని

గుర్తిస్తున్నావు కాబట్టి.

నీకు అన్యంగా గోచరిస్తే,

దేవుడు కూడా కలవరింతే.

వేదం కూడా పలవరింతే.

**403.** అనసూయ : మహాశివరాత్రి శుభాకాంక్షలండీ గురువుగారూ!

సద్గురు : ప్రపంచానికి ఈ రోజు మాత్రమే శివరాత్రి.

మనకు ప్రతిరోజూ శివరాత్రే.

**404.** ప్రశ్న : సంఘంలో మార్పు తేవలసిన అవసరం ఏదయినా ఉందా?

సద్గురు : మార్పు తేవల్సిన అవసరం ఏదైనా ఉందంటే, అది తన ఒక్కని విషయంలోనే. నిజానికి తన విషయంలో కూడా ఆ అవసరం లేదు.

**405.** బాబు : దేవుడెవరు?

సద్గురు : సాకారుడైన బాబుకు
నిరాకారుడైన బాబుయే దేవుడు.

**406.** బాబు : నేను బ్రహ్మమగుటకు మార్గమేమి?

సద్గురు : ఇప్పటి వఱకు నీవు
నేను బాబు - బాబు అని అనుకుంటున్నావు.
ఇక నుంచి
నేను బ్రహ్మము - బ్రహ్మము అని అనుకో.

**407.** ప్రశ్న : నేను ఎవడను?

సద్గురు : "ఎవడు'అనేదే నేను.

**408.** మతవాది : ఇతర మతాలు బలం పుంజుకుంటున్నాయి.
వారు బలవంతులై మిమ్మల్ని
తమ మతాన్ని పుచ్చుకోమని బలవంతం
చేస్తే మీరేం చేస్తారు?

సద్గురు : తప్పకుండా వారి మతాన్నే పుచ్చుకుంటాను.
నా దేవుడు అల్లా! అన్నా పలుకుతాడు.
యెహెూవా! అన్నా పలుకుతాడు.
నా దేవుడు సర్వజ్ఞుడు, సర్వ శక్తిమంతుడు,
సర్వ వ్యాపకుడు.
నా దేవుడికి మతం అవసరం లేదు.

**409.** ప్రశ్న : మహాత్మ అంటే?

సద్గురు : నామరూపములు లేనిది ఏదో అదే మహాత్మ.

**410.** దొరబాబు : పట్టెయ్యగారు ఎందుకలా
గురువుగార్ని ప్రశ్నలు వేసి
విసిగించడం?

సద్గురు : ఇప్పుడు పట్టెయ్యను ప్రశ్నలు
వేయకుండా ఆపడం ఆ బ్రహ్మ దేవుని వల్ల కూడా
కాదు.
ప్రశ్నలు కలగని స్థితి పట్టెయ్యకు
వచ్చినప్పుడు పట్టెయ్య చేత
ప్రశ్నలు వేయించడం బ్రహ్మదేవుని
వల్ల కూడా కాదు.

**411.** ప్రశ్న : ప్రపంచంలోని సుఖదుఃఖాలకు కారణం -
కర్మా?
దైవమా?
సమాజమా?

సద్గురు : ప్రపంచాన్ని ఎవడు గుర్తిస్తున్నాడో వాడే సృష్టికర్త.
సుఖ దుఃఖాలను ఎవడు గుర్తిస్తున్నాడో వాడే వాటికి
కారణం.

**412.** బాబు : వరలక్ష్మి గారికి వారి గురువు గారు
సన్న్యాసదీక్ష ఇచ్చారట...

సద్గురు : గురువు నిజంగా సన్న్యాసే అయితే మరొకరికి సన్న్యాస దీక్ష ఇచ్చే అవసరమూ, అవకాశమూ ఉండదు.

413. సద్గురు : ఎక్కువ స్వార్థపరుడెవడు?
Temporary సుఖాన్ని కోరేవాడా?
Permanent సుఖాన్ని కోరేవాడా?

బాబు : Permanent సుఖాన్ని కోరేవాడే...

సద్గురు : అయితే మోక్షసుఖాన్ని కోరేవాడే ఎక్కువ స్వార్థపరుడు.

414. బాబు : అరుణాచలం వెళదామని అనుకుంటున్నాను...

సద్గురు : ఆకాశం నుండి వాయువు
వాయువు నుండి అగ్ని
అగ్ని నుండి జలము
జలము నుండి పృథివి వచ్చాయి.

చిదంబరం - ఆకాశలింగం.
శ్రీకాళహస్తి - వాయులింగం.
అరుణాచలం - అగ్నిలింగం.
జంబుకేశ్వరం - జలలింగం.
కంచి - పృథివీ లింగం.

వరుసగా అవి ఒకదానికంటే మరొకటి గొప్ప క్షేత్రాలు.

కాబట్టి అరుణాచలం కంటే శ్రీకాళహస్తి గొప్ప క్షేత్రం.
శ్రీకాళహస్తి నుండి అరుణాచలానికి
ప్రయాణించవలసిన అవసరం లేదు.

అలా ప్రయాణిస్తే ఎదగడం కాదు దిగడం అవుతుంది.

శ్రీకాళహస్తి నుండి ప్రయాణించవలసిన ఏకైక క్షేత్రం చిదంబరం. చిదంబర (ఆత్మ)వాసులు ఇంకెక్కడికీ వెళ్లవలసిన అవసరం లేదు.

415. ప్రశ్న : ధర్మోరక్షిత రక్షితః అంటారే...

సద్గురు : ధర్మాన్ని మనం రక్షించవలసిన దౌర్బల్య పరిస్థితిలో ధర్మం ఉంటే అది ధర్మమెలా అవుతుంది? సమస్తాన్ని ధర్మమే రక్షిస్తూ ఉంది. అని ఉండడమే గొప్పధర్మం.

416. ఒకరు : తాను పుట్టిన లగ్న ప్రభావం తన జీవితంపై ఉంటుందా? మనిషిని శాసించి నడిపే శక్తి గ్రహ నక్షత్రాదులకు ఉంటాయా?

సద్గురు : గ్రహ నక్షత్రాదులు కూడా ఈశ్వరాధీనమై ఉంటాయి.

* * *

ఈశ్వరునికి శరణాగతి చెందిన ఒక్క
భక్తుని విషయంలో మాత్రం అది చెల్లదు.

భక్తుడు దేహ తాదాత్మ్యతను వొదిలి,
ఈశ్వరునితో తాదాత్మ్యతను పొంది ఉంటాడు.

అందువలన దేహమనుభవించే సుఖదుఃఖాలు
అతన్ని "అంటవు". అంతేగాని అతనికి
"ఉండవు" అని కాదు.

ప్రపంచం దృష్టిలో తాను, తనకు
సుఖదుఃఖాలు ఉన్నట్లు కనబడుతుందే గాని
నిజానికి తన దృష్టిలో తానే ఉండదు.

రమణ భగవానులకు క్యాన్సర్ రావడం అనేది
ప్రపంచం దృష్టిలోనే గాని
భగవాన్ అనుభవంలో భగవానే లేదు.

**417.** ఒకరు : ఆధ్యాత్మికంలో ఆ 'ఉన్నతస్థాయి'కి వెళ్లకపోతున్నాను స్వామీ...

సద్గురు : వెళ్లలేక కాదు, ఇష్టం లేక.

**418.** పట్టెయ్య : శ్రీరామనమి సందర్భంగా సందేశం ఇవ్వండి గురువుగారూ!

సద్గురు : పొరబాటున కూడా
శ్రీరాముణ్ణి ఆదర్శంగా తీసుకోవద్దు.
(నీవు నీవుగా ఉండు అని భావము)

419. ఒకరు : సాధన వలన కర్మలు తొలగుతాయా?

సద్గురు : సాధన అనేది కూడా కర్మే.
కర్త తొలగితే కర్మలు తొలగుతాయి.

420. ఒకరు : ఇన్ని సూక్తులు అవసరమా?

సద్గురు : మోక్షఫలాన్ని కొట్టడానికి ఉపయోగించే
రాళ్లు ఈ జ్ఞాన ప్రసూనాలు.
ఏదో ఒక రాయి తగలకపోతుందా?
ఏదో ఒక రోజు దొరకకపోతుందా?
అనే ఆశాభావంతో ప్రయత్నించడమే సత్సంగం.

421. ఒకరు : సాధన అవసరమా?

సద్గురు : "అది" కానిది ఏదీ లేదు.
"అది" లేని చోటు ఎక్కడా లేదు.
మరి సాధనకు అవకాశమెక్కడిది?

422. బాబు : మన (విచారణా) కోణంలో నుంచి
చూస్తే ప్రపంచం అనేది
పెద్ద పిచ్చాసుపత్రి లాగా కనిపిస్తోంది.

సద్గురు : 'లాగా' కాదు. పిచ్చాసుపత్రే.
సందేహం లేదు.
పిచ్చాసుపత్రినే ప్రపంచంగా
మనం అనుభవిస్తుండేది.

423. పట్టెయ్య : గురువు గారి సూక్తులు కఠినంగా ఉంటాయి.
మీరు కాస్త వాటిని సరళం చేయవచ్చు కదా!

బాబు : సత్యం అలాగే ఉంటుంది.
వజ్రాన్ని మెత్తపరచలేం.
పుష్పాన్ని కఠినపరచలేం.
ఆకాశాన్ని ముక్కలు చేయలేం.
సత్యాన్ని మార్పు చేయలేం.

424. ఒకరు : ఆహా! రమణుడు ఎంతటి వైరాగ్యమూర్తి!
**16**వ ఏటనే కౌపీనధారియై జ్ఞాన సుగంధాన్ని
ప్రపంచమంతా వ్యాపింప చేశారు.

సద్గురు : నిజంగా అది గొప్ప అని నీవు భావిస్తే,
నీ ముద్దుల కుమారుడు అలా **16** వ ఏటనే
ఇల్లు వదిలి కౌపీనధారి అయ్యి ఉంటే,
నీవు హర్షించి ఉండే వాడివా?

పరాయి బిడ్డను బావిలో వేసి లోతు తెలుసుకోవడం
లాంటిదే నీవు రమణుణ్ణి పొగడ్డం.

**425.** రామాంజనేయులు : మీ సూక్తులు, గొప్పవే, కాదనను. సామాన్యులను కూడా దృష్టిలో పెట్టుకుని చెబితే బాగుంటుంది. ఇటు వ్యక్తి శ్రేయస్సు, అటు సంఘ శ్రేయస్సు రెండూ ఒనగూడుతాయి. వాటిని సరిగా అర్థం చేసుకోకుండా నాస్తికత్వంలోకి వెళ్లి చెడిపోయే ప్రమాదం ఉంది.

సద్గురు : మన సూక్తులు చదివి చెడిపోయేంత అమాయకులు ఎవరూ లేరండి లోకంలో. అలా ఎవరైనా 'చెడిపోతే' చూడాలని ఆశ నాకు.

మహనీయులు అని మనం ఎవర్నయితే అంటున్నామో వారు అలా చెడిపోయి వచ్చినవారే అరుణాచలానికి.

మానవుడు చెడిపోకుండా ప్రయత్నం చేసేవాడు సంస్కర్త.

మానవుడు చెడిపోవడానికి సహాయం చేసేవాడు వేదాంతి.

* * *

తన్ను తాను పోగొట్టుకున్నవాడు
తన్ను తాను పొందుతాడు.
'ఇక్కడ' పనికిరానివాడు.
'అక్కడ' పనికొస్తాడు.

* * *

సదా శివబ్రహ్మేంద్రస్వామి దిగంబరుడై
పిచ్చివానివలె తిరుగాడుతుంటే, ఒకడు వెళ్లి వారి గురువుగారికి చెప్పారట – "స్వామీ! మీ శిష్యుడు పిచ్చివాడై తిరుగుతున్నాడు" అని.

అందుకా గురువు అన్నారట –

"ఆ పిచ్చి నాకెప్పుడు కలుగుతుందో!!" అని.

**426.** సద్గురు : శ్వాస అనేది తలంపా? క్రియా?

బాబు : క్రియే.

సద్గురు : కాదు. తలంపు.

**427.** ప్రశ్న : మాయ ఎందుకు కలిగింది?

సద్గురు : సనాతన ధర్మం మాయ ఎందుకు కలిగింది? అన్నదానికి సమాధానం చెప్పలేదు.
మాయ నుండి బయటపడే మార్గం మాత్రమే చెప్పింది.
కల ఎందుకు కలిగింది?
ఈ కలే ఎందుకు కలిగింది?
అని అడిగితే ఎవరు చెప్పగలరు?
నిన్ను కలనుంచి మేలుకొలుపగలరు అంతే.
నిన్ను మేలుకొలిపే వాడినే గురువు అనేది.
నిజానికి గురువు కూడా నీ కలలో భాగమే.

నీవు కొలిచే దేవుడు కూడా.
మేలుకొంటే నీవే మహాదేవుడు.

428. సద్గురు : రామాయణంలో రాముణ్ణి గురించి
ప్రస్తావనే లేదు.

భారతంలో కృష్ణుణ్ణి గురించి
ప్రస్తావనే లేదు.

బాబు : మరి ప్రస్తావించబడినట్లున్నది కదా!

సద్గురు : అది వాల్మీకి గురించిన ప్రస్తావన.
వ్యాసుని గురించిన ప్రస్తావన.

429. ప్రశ్న : ఏది బంధం? ఏది మోక్షం?
సద్గురు : ఉన్నది ఒకే భగవత్తత్త్వం.
ఉన్నదంతా భగవద్రూపం.
భగవదర్పణకు లేదు అవకాశం.
అని ఎఱుగట మోక్షం.
మరచుట బంధం.

430. కృష్ణప్రసాద్ : 'కర్మయోగం' యొక్క పాత్ర ఏమి?

సద్గురు : గమ్యాన్ని చేరనీయకుండా
దారి తప్పించి
నిన్ను యోగభ్రష్టుణ్ణి చేసే
ఓ ప్రక్రియ అది.

**431.** ప్రశ్న : సకల సృష్టి స్థితి లయములకు కారణం ఆదిశక్తియా?

సద్గురు : శక్తికి స్వతహాగా ఉనికి లేదు.
శక్తుడే కారణము.
శక్తుడు ప్రకటించబడు క్రమాన్నే
శక్తి అని పిలిచేది.
శక్తునికే శక్తి ఉండేది.
శక్తికి శక్తి ఉండదు.

**432.** ఒక్కరు : స్వాములు అనబడేవారు రాజకీయ నాయకుల వద్దకు వెళుతుంటారు, రాజకీయ సభల్లోకి కూడా వెళుతుంటారు. ఇది సబబేనా?

సద్గురు : స్వాములున్న చోటుకి ప్రభువులు రావాలే గాని
ప్రభువులున్న చోటుకి స్వాములు వెళ్లకూడదు.

ప్రపంచం యొక్క అవసరం స్వామికి ఉండదు.
స్వామి యొక్క అవసరం ప్రపంచానికి ఉంటుంది.

దేనికి అవసరమో అది కదలాలి.
స్వామి కదలకూడదు.
స్వామి కదలితే 'స్వామి' అన్న పదానికి
అంత కన్నా అగౌరవం మరొకటి లేదు.

రమణుడు అరుణాచలం నుండి కదలలేదు.
ప్రపంచం నలుదిశల నుండి ప్రజలు ఆయన పాదాల
వద్దకు కదిలారు.

**433.** పట్టెయ్య : మాంసాది ఆహారములు భుజించేవారికి
ఆత్మవిద్య అబ్బునా?

సద్గురు : ఆత్మ నుంచి ప్రకృతి
ప్రకృతి నుంచి ఆహారం
ఆహారం నుంచి మనసు
తయారవుతుంది, ప్రభావితం అవుతుంది.

కాబట్టి మనసును పలుచబరిచే
క్రమంలో ఆహార ప్రాధాన్యత
ఎంతైనా ఉంది.

ఇదంతా సాధకుల కోసమే గాని
సిద్ధుల కోసం కాదు.

సిద్ధుడు ఏమైనా తినొచ్చు, ఎలా అయినా ఉండొచ్చు.

నువ్వు ఇలానే ఉండాలి అని సిద్ధుణ్ణి
శాసించే హక్కు భగవంతుడికి కూడా లేదు.

**434.** పట్టెయ్య : శివుడికి పెడుతున్నాని ఏ జీవికి ఆహారం పెట్టినా
సాక్షాత్తు శివుడే తింటాడని అన్నారు తమరు...

సద్గురు : శివుడు అని తలవక పెట్టినా తినేది శివుడే.

**435.** ప్రశ్న : మూఢనమ్మకం అంటే?

సద్గురు : అనుభవం లేని కేవల నమ్మకానికే
'మూఢ నమ్మకం' అని పేరు.
అనుభవంలో 'నమ్మకం'తో పనిలేదు.

**436.** మధుసూదన్ : గురువుగారిని కలవాలంటే ముందుగా అనుమతి తీసుకోవాలా?

బాబు : ఖాళీగా ఉంటారు.
మీలాంటి భక్తుల రాక కొఱకు
గుమ్మం వద్ద నిల్చొని ఎదురు చూస్తుంటారు.
మనకంటే ఆయనకే అవసరం అన్నట్టు
ఆదరిస్తారు, ప్రబోధిస్తారు.

**437.** ఒకరు : అద్వైతం Dry Subject...

సద్గురు : నిజమే. అద్వైతంలో ఆర్ద్రత (భక్తి) కలుపుకుని విశిష్టాద్వైతం అనే క్రొత్త మతం ఏర్పడింది.
మన కష్టసుఖాలకు స్పందిస్తుంది విశిష్టాద్వైతం.
అద్వైతానికి కనికరం ఉండదు. అద్వైతం రాజీపడదు.
అద్వైతంలో 'రెండు'కు ఉనికి లేదు, దయకు తావులేదు.

**438.** పట్టెయ్య : షిరిడీబాబా దేవుడు కాదని కొందరు స్వాములు వాదిస్తున్నారు . . .

సద్గురు : వాదన ఎప్పుడూ తన సిద్ధాంతం పట్ల తనకున్న అపనమ్మకాన్నే సూచిస్తుంది.

ఒకడు కాపాడవలసిన దౌర్భాగ్యస్థితిలో సనాతన ధర్మం ఎప్పుడూ ఉండదు.

గోపుర భారాన్నంతా తానే మోస్తున్నట్టు కనబడే శిల్పాలు లాంటివారు ఈ స్వాములంతా.

జగద్రూపంగా ఉండేది దేవుడే.

జగత్తులో ఏ ఒక్కడు మాత్రమే దేవుడు కాదు.

'నేనే దేవుణ్ణి' అని బాబా అనలేదు.

'ప్రతి ఒక్కడూ దైవ స్వరూపుడే' అని బాబా అన్నారు.
జ్ఞానికీ ఏ గొడవా ఉండదు.
అజ్ఞానికీ ఏ గొడవా ఉండదు.
మధ్యలో ఉన్నవారికే అన్నీను.

**439.** రామసీత : మీకు ఆ (సిగరెట్) దుర్వ్యసనం లేకుండా ఉండి ఉంటే బాగుండేది.

సద్గురు : 'నేను సుబ్రమణ్యం' అనుకోవడమే పెద్ద దుర్వ్యసనం.

నిజానికి దేవుడే 'నాన్‌స్టాప్ స్మోకర్'.

ఒకడు పుట్టడం అంటే,
దేవుడు సిగరెట్‌ను ముట్టించడమన్నమాట.

వాడు జీవించడం అంటే,
దేవుడు సిగరెట్‌ను త్రాగుతున్నట్టు.

వాడు మరణించాడు అంటే,
దేవుడు సిగరెట్ పీకను నలిపి పారవేసినట్టు.

ఇలా యుగాల పర్యంతం జరుగుతూనే ఉంది,
అందుకే దేవుడు 'నాన్ స్టాప్ స్మోకర్' అన్నాను.

440. ప్రశ్న : భగవంతుడు జగత్తును ఎందుకు సృష్టించాడు?
సద్గురు : Everything is possible for GOD.

భగవంతునికి అన్నీ సాధ్యమే.

ఆయన సర్వసమర్థుడు.

అని అంటూనే ఎందుకు? అని ప్రశ్నించడం స్వవచో వ్యాఘాతం. (తన మాటను తానే ఖండించుకోవడం) అవుతుంది.

ఎందుకు? అన్న ప్రశ్న దేవుని విషయంలో చెల్లదు.

ఎందుకు? అన్న ప్రశ్న ఆయనకూ
ఏదో ఒకటి చేస్తూ, చేయకుండా ఉండలేని
దౌర్భల్యస్థితి ఒకటి ఉందని
అంగీకరించినట్లవుతుంది.

మనకు దాహం వేస్తుంది, నీళ్లు త్రాగుతాం.
ఇదొక రకమైన బానిసత్వం.

నీళ్లను త్రాగకుండా ఉండలేక పోవడం
అనేది బానిసత్వమే కదా?

అట్లా భగవంతుని విషయంలో 'ఎందుకు?' అనే ప్రశ్నే పొసగదు.

"సృష్టి చేయకుండా ఉండలేక సృష్టి చేసిన దుర్బలుడు దేవుడు" అని చెప్పడమే అవుతుంది.

ఆయనకు అన్నీ సాధ్యమే అన్నాక ఎందుకు?

అన్న ప్రశ్న అసంగతం(Absurd)

**441.** ప్రశ్న : స్వధర్మం అంటే?

సద్గురు : "ఇతరం కూడా నేనే"

అన్న స్వానుభవ నిష్ఠయే స్వధర్మం.

**442.** పట్టైయ్య : మరణం తరువాత ప్రపంచం ఉండదు అంటున్నారు... పాపపుణ్య కర్మానుభవాలు (స్వర్గ నరకాలు) కూడా ఉండవా?

సద్గురు : మరణం తరువాత ప్రపంచం బీజ రూపంలో ఉంటుంది. పాప పుణ్య కర్మానుభవం కూడా సూక్ష్మరూపంలో ఉంటుంది. దానినే మనం స్వర్గనరకాలనేది. కాకపోతే సినిమాలో చూపించే విధంగా ఉండవు.

సుఖ నిద్రకు, కలత నిద్రకు ఉన్న తేడా లాంటివవి. ఇదంతా భగవంతునిలో ఉన్న సహజమైన ఊహాగానాలే ఈ లోకాలు, ఈ జీవులు, ఈ కర్మలు, ఈ జన్మలు...

నీవు మేలుకొంటే (ఆ 'ఒక్కడి'తో నీవు మమేకం అయితే) ఇదంతా నీ లీలగానే గోచరిస్తుంది. లేదంటే ఎవడో సృష్టించిన గోలగా అనిపిస్తుంది.

**443.** ఒకరు : మన హిందూమతమే గొప్పది.

సద్గురు : ఏ మతమైనా గొప్పదే.
నా మతమే గొప్పది అనటం తప్పు.

* * *

పరమసత్యాన్ని (Ultimate Truth) తెలుసుకోవాలంటే ముందు నేను ఫలానా మతస్తుణ్ణి అనే భావం తొలగాలి.

మతం ద్వారా భగవంతుణ్ణి పొందలేం.
ఎవరూ పొందలేదు.

* * *

మన హిందూమతం, మన హిందూమతం అంటుంటారు. హిందూమతం అంటే ఏమిటో తెలియదు.

సినిమా హీరోల మీద ఉన్న పిచ్చి అభిమానం లాంటిదే ఇది కూడా.

మతాన్ని వదిలితే అక్కడే ఉంటాడు భగవంతుడు.

మత గ్రంథాల్లో ఎవరు ఏం చెబితే మనకేమిటి?
మనకు కావలసింది ఆత్మ సాక్షాత్కారం.

ఆత్మ మనలోనే ఉంది, మనలోనే వెదుకుదాం.
మతాలతో, దేవుళ్ళతో మనకేం పని?
మ్యాంగో చాక్లెట్ చప్పరించడానికి,
మ్యాంగో తినడానికి తేడా లేదా?
మతాల్లో ఉండే దేవుడు మ్యాంగో చాక్లెట్.
మనలో ఉండే దేవుడు (ఆత్మ) ప్యూర్ మ్యాంగో.

**444.** ప్రశ్న : పునర్జన్మలున్నాయా?

సద్గురు : "ఈరోజు నీవు చేసిన తప్పుకు ఏ రోజుటికైనా శిక్షను అనుభవించి తీరాలి". అన్న సూత్రమే పునర్జన్మ సిద్ధాంతానికి ఆధారం. చర్యకు ప్రతి చర్య ఉండడం అనేది ప్రకృతి నియమం.

చర్యకు ప్రతిచర్య జరిగే లోపు తాను మరణిస్తే ఆ ప్రతి చర్యను అనుభవించడానికి జీవుడు మరో జన్మను తీసుకుంటాడు అనేది సనాతన భావం. చర్యకు ప్రతి చర్య అనేది నిజానికి ఎప్పటికప్పుడు జరిగే ప్రాసెస్.

నిప్పును తాకితే అప్పుడే కాలినట్లు.
ఆ ప్రతి చర్యను నీవు గుర్తించలేకపోవచ్చు.

ఈ జన్మలో చేసిన చర్యకు వచ్చే జన్మలో ప్రతి చర్య అనేది ఒక అభూతకల్పన.

సంఘాన్ని సక్రమంగా నడపడానికి గాను సదుద్దేశంతో కల్పించబడిన ఓ మంచి అబద్ధం.

"అదిగో బూచాడొస్తున్నాడు" అని చెప్పి చంటాడికి అన్న తినిపించడం అనే ప్రయోజనాన్ని తల్లి నెరవేర్చుకున్నట్లు, స్వర్గాలు, నరకాలు, పరలోకపు తీర్పులు... ఇవన్నీ అభూత కల్పనలు.

'పునర్జన్మ లేదు' అని నిజం చెప్పి నేను ఇప్పుడు సాధించబోయేది కూడా ఏమీ లేదు.

ప్రపంచం యథావిధిగా ఉంటుంది. సందేహం లేదు.

సముద్రంలో ఓ గ్లాసు నీటిని కలిపి, తిరిగి అదే నీటిని గ్లాసులోకి తీసుకోగలమా?

మరణం అంటే అనంతంగా మారటం.
జననం అంటే పరిమితంలోకి జారటం
అనే విషయాన్ని తాను జీవించి ఉన్నప్పుడే గ్రహించడమే మోక్షం.

అదే జీవన్ముక్తి.

జన్మకు, కర్మకు కారణం ఈశ్వరసంకల్పం అనేది తిరుగులేని సిద్ధాంతం.

**445.** రామాంజనేయులు : గురువుగారూ! ఈ రోజు 400 మంది శ్రోతలు హాజరువుతున్న సభకు నేను వక్తగా వెళుతున్నాను...

సద్గురు : అంటే 400 మందిని మోసం చేయడానికి వెళుతున్నావన్నమాట....

**446.** బాబు : భారతం చెప్పినవాడు -వ్యాసుడు.
వ్రాసినవాడు - విఘ్నేశ్వరుడు.
ఇద్దరూ గొప్పవాళ్ళే.

సద్గురు : నిజానికి భారతం చదివేవాడే వారిద్దరి కన్నా గొప్పవాడు.

**447.** ఒకరు : మీ బోధలు కొన్ని మాకు నచ్చలేదు స్వామీ...

సద్గురు : మాక్కూడా...

సత్యానికి మన ఇష్టాయిష్టాలతో పనిలేదు.

**448.** పట్టెయ్య : బోధకులంతా మహనీయుల్ని ఆదర్శంగా తీసుకోమని బోధిస్తున్నారు. మీరేమో అది వీలు కాదంటున్నారు.

ఆదర్శమే లేకపోతే సనాతన ధర్మం ఇంత వైభవంగా తన అస్తిత్వాన్ని కొనసాగించి ఉండగలదా?

సద్గురు : ఇంతకాలంగా అస్తిత్వాన్ని కొనసాగించడం ఆదర్శంగా తీసుకోవడం వలన కాదు.

ఆదర్శంగా తీసుకోదగ్గ మహనీయులు పుట్టడం వలన.

ఆదర్శం అనేది అనుసరణాకాదు, అనుకరణా కాదు.

పుట్టుక నుంచే ప్రతి మనిషిలో ఉన్న 'ప్రత్యేకత'ను వెలికి తీయగలిగే అద్భుత సాధనమే సత్సంగం.

'భారతీయత' అనే జ్యోతిని కొడిగట్టకుండా అఖండంగా ప్రకాశింపజేయడానికి వత్తికి మరో వత్తిని చేరుస్తూ వస్తున్నట్టుగా, నీవు మరో వత్తిగా చేర్చబడాలి.

అదే అఖండ దీపం.
అదే ఆదర్శ జీవితం.
ప్రతి ఒక్కడు వైవిధ్యతను ప్రకటించాలి.
అంతర్లీనంగా ఏకత్వాన్ని అనుభూతి చెందాలి.
అంతేగాని ఆదర్శం వలన మరో బుద్ధుడు రాడు.
మరో శంకరుడు రాడు.
మరో రమణుడు రాడు.
మరో గాంధీ రాడు.
వారు వారే
మీరు మీరే.

**449.** పట్టెయ్య : 'నేను పట్టెయ్య' అని అనుకోవడమే మూఢ విశ్వాసం అన్నారు వివరించండి...

సద్గురు : 'నేను పట్టెయ్యను' అనే మూఢ విశ్వాసం ఉండేది దేవుడికి. పట్టెయ్యకు కాదు.

ఆయన మూఢ విశ్వాసం వల్లనే పట్టెయ్య,
పట్టెయ్యతో పాటు జగత్తూ పుట్టింది.

పట్టెయ్యకు అస్సలు ఉనికే లేదు.
సద్విశ్వాసమైనా, మూఢ విశ్వాసమైనా
పట్టెయ్యకు ఎలా ఉంటుంది?

అసలు పుట్టనివానికి మీసాలు ఉన్నాయా? లేవా?
అని వాదించుకోవడం వెర్రితనం.

ఆకాశ పుష్పం ఏ రంగులో ఉందని పరిశీలించడం
వెర్రితనం.

స్వప్నంలో చూచిన భవనాన్ని ఎవరు కట్టారు? ఏ
సంవత్సరంలో కట్టారు అని విచారించడం
వెర్రితనం.

గొడ్రాలి బిడ్డకు వధువును వెతకడం వెర్రితనం.

* * *

ఉనికి ఉండేది ఒక్కడికే.
వాడికే 'దేవుడు' అని పేరు పెట్టుకున్నాం.

సద్విశ్వాసమైనా, మూఢ విశ్వాసమైనా
ఉండేది ఆ ఒక్కడికే.

జ్ఞానమైనా, అజ్ఞానమైనా ఆ ఒక్కనిదే.
జ్ఞప్తి అయినా, మఱపు అయినా ఆ ఒక్కనిదే.

సుఖమైనా, దుఃఖమైనా ఆ ఒక్కనిదే.
బంధమైనా, మోక్షమైనా ఆ ఒక్కనిదే.

నీకు అస్సలు ఉనికే లేదు.
కాబట్టి నీకు బంధమూ లేదు, మోక్షమూ లేదు.

450. మురుగానంద : (ఫోనులో) స్వామీ! ఏదైనా మంచి విషయం చెప్పండి...

సద్గురు : నేనెక్కడ ఉన్నాను?

మురుగానంద : శ్రీకాళహస్తిలో.

సద్గురు : నీవెక్కడ ఉన్నావు?

మురుగానంద : వైజాగ్‌లో.

సద్గురు : నిజమేనా?

మురుగానంద : నిజమే...

సద్గురు : రెండూ అబద్ధమే.
మనమిద్దరం నేల మీద ఉన్నాం.

451. హరి : ఆనందం కలగాలంటే ఏం చేయాలి?

సద్గురు : ఏమీ చేయనక్కర్లేదు.
ఆనందం అనేది సదా.
అది ఎప్పుడూ ఉంటుంది.
అది నీ స్వరూపం.

వచ్చేది - ఉండేది - పోయేది 'హరి'నే
హరికి ఆనందం కాదు,
ఆనందమే హరి.

**452.** సద్గురు : లోకంలో జ్ఞానుల సంఖ్య ఎక్కువ.
అజ్ఞానుల సంఖ్య తక్కువ.

బాబు : అదెలా?

సద్గురు : 'ఇక్కడ' అజ్ఞానులుగా పిలువబడేవారు
'అక్కడ' జ్ఞానులుగా పరిగణింపబడుతారు.

ఆ లెక్కలో జ్ఞానుల సంఖ్య ఎక్కువ అన్నాను.

**453.** పట్టెయ్య : ఇప్పుడు లోకంలో కనిపించే భక్తి సరియేనా?

బాబు : అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ 'భక్తి' అనేది ఆంతరంగిక విషయం. కంటికి కనిపించేది కాదు.

**454.** పట్టెయ్య : భక్తికి మీరిచ్చే నిర్వచనం ఏమి?

బాబు : Limitsless Love (పరిమితులు లేని ప్రేమ)

**455.** ప్రశ్న : మోక్షమంటే?

సద్గురు : టార్చ్ లైట్ వేసుకుని టార్చ్ లైట్‌ను వెదికినట్లు తాను చేసే సాధనలు కూడా. తానే అన్నిటికీ ప్రకాశం.
తానే అన్నిటికి మూలం.
తాను వెదికేది తననే అని తెలిస్తే అదే మోక్షం.

456. ప్రశ్న : ధర్మ సంస్థాపన అంటారే...

సద్గురు : ధర్మాన్ని ఎవరూ స్థాపించవలసిన అవసరం లేదు.
నిలబెట్టవలసిన అవసరం అంతకన్నా లేదు.
రక్షించవలసిన అవసరం అంతకు ముందే లేదు.

ధర్మం దానికదే స్థాపించుకుంటుంది.
నిలబెట్టుకుంటుంది,
రక్షించుకుంటుంది.

మరి యదా యదాహి ధర్మస్య...అని
కృష్ణభగవానుడు చెప్పాడు కదా?
అని అంటావేమో?

కాదు.

మరి ఎవరు చెప్పారు?
ధర్మం చెప్పింది.

గీతలో 'అహం' అన్న చోటెల్లా
అన్నది కృష్ణుడు కాదు ధర్మమే.

మరి భగవాన్ ఉవాచ అని ఉన్నది అంటే,
"ధర్మం ఇలా అన్నది" అని భగవానుడు
చెప్పాడు అని అర్థం

457. పట్టెయ్య : అంతా భగవదిచ్ఛ అన్నాక
ఇక దేంట్లోనూ వ్రేలు పెట్టకూడదు...

సద్గురు : వ్రేలు పెట్టడం కూడా భగవదిచ్ఛే.

**458.** పట్టెయ్య : రమణ సత్సంగంలో సత్య ప్రకటనం చాలా కఠినంగా ఉంటుంది.

కాస్త సుతిమెత్తగా చెబితే బాగుండును...

బాబు : అపరంజిలో కాస్త రాగి కలిపి మెత్తబరచినట్లు కాస్త అబద్ధాన్ని కలిపితే మెత్తబడుతుంది.

అప్పుడు అనడానికి, వినడానికి ఇరువురికి మెత్తగా, మత్తుగా ఉంటుంది.
కానీ ఇరువురికీ ప్రమాదం.

**459.** హరి : 'నేను' మూలాన్ని నేను ఎలా కనుగొనగలను?

సద్గురు : నీ తల్లిదండ్రుల వివాహాన్ని
నీవు చూడడం సాధ్యమైతే
నీ మూలాన్ని నీవు కనుగొనడంకూడా సాధ్యమే.

హరి : నేను మూలమేమి?

సద్గురు : నేను యొక్క మూలం 'నేనే'

హరి : 'నేను' మూలాన్ని కనుగొనమని రమణులు చెప్పేవారు కదా?

సద్గురు : ఆ రమణునికి కూడా మూలం నీవే.
'నేను' కు మూలం ఇంకేదో ఉందని
అనుకుని అన్వేషణ ప్రారంభిస్తాం. చివరికి
'రెండు నేనులు' లేవని తెలిసి అన్వేషణ ముగిస్తాం.

**460.** ఒకరు : ఈ కలియుగంలో ఎలా ఉండాలి?

సద్గురు : సాక్షిగా...

**461.** ప్రశ్న : "స్వయంభూ" అంటుంటారే? ఏమది?

సద్గురు : విగ్రహస్థాపన వలన ఆ క్షేత్రానికి (భూమికి) మహిమ రావడం కాదు,
ఆ క్షేత్రం (భూమి)లో మహిమ ఉండడం గుర్తించి,
పెద్దలు ఆ చోటులో విగ్రహాల్ని స్థాపిస్తూ వచ్చారు.

మూర్తి వలన శక్తి కాదు,
ఆ చోటు వలన మూర్తికి శక్తి.
స్వయంభూ అంటే,
విగ్రహం స్వయంభూ అని కాదు,
భూమి నుండి వ్యక్తమయ్యే శక్తి స్వయంభూ.

**462.** పట్టెయ్య : ప్రారబ్ధం అంటే ఏమిటి స్వామీ?
దానికి తలా ఒక అర్థం చెబుతున్నారు . . .

సద్గురు : వాడి వాడి ప్రారబ్ధాన్ని బట్టి
ప్రారబ్ధానికి అర్థాలు గోచరిస్తుంటాయి.

**463.** ప్రశ్న : ఎవడు పుణ్యాత్ముడు?

సద్గురు : మనసా – వాచా – కర్మణా
"నేను పాపిని" అని ఎవడైతే ఉంటాడో
వాడే పుణ్యాత్ముడు.

464 ప్రశ్న : ఏది అధర్మం?
ఏది ధర్మం?

సద్గురు : ఇతరులకు ఇబ్బంది కలిగించే
పనులు చేయడం - అధర్మం.

ఎవరికీ ఇబ్బంది కలిగించకుండా
జీవిచడం - ధర్మం.

465. ఒకడు : సత్యాన్ని అందరూ ఎందుకు గ్రహించలేక
పోతున్నారు?

సద్గురు : ఉండేది నీ వొక్కడివే.
"అందరూ" ఎక్కణ్ణుంచి వచ్చారు?
ఆధ్యాత్మికంలో అనవసరమైన పదం -
"అందరూ"అనేది.

కల నుంచి నీ వొక్కడివి మేలుకొంటే కలలో ఉన్న
"అందరూ" ఒక్కసారిగా లేకుండా పోతారు.
నీ వొక్కడివి మాత్రమే శేషిస్తావు. గురువు, దైవము,
ప్రపంచము అన్నీ నీ కలలో భాగమే, నీతో సహా.

466. ప్రశ్న : స్వధర్మం అంటే?

సద్గురు : ఒకరి చేత ఆచరించబడేది కాదు
ధర్మం అంటే.
ధర్మం అనేది స్వయం.

అందుకే స్వధర్మం అన్నారు.
స్వధర్మం అంటే ధర్మం అనేది స్వయం అని అర్థం.

467. ఒకరు : రమణ జయంతి ఎప్పుడు?

సద్గురు : డిశెంబర్ 30న అందరూ అనుకుంటారు. కాదు. వేంకటరామన్ అనబడే ఆ 16 ఏళ్ల బాలుడు మేడపైన గదిలోన మృత్యానుభవం పొందినరోజే నిజంగా భగవాన్ రమణుల పుట్టిన రోజు.

468. పట్టైయ : బాబా దేవుడు కాదని అంటున్నారు కొందరు...

సద్గురు : అసలు దేవుడనేవాడే దేవుడు కాదు.

పట్టైయ్య : మరి దేవుడెవడు?

సద్గురు : "నేను"

పట్టైయ్య : "నేను" దేవుడైతే మరి పట్టైయ్య ఎవరు?

సద్గురు : అహం ప్రకాశంలో ఓ కిరణం పట్టైయ్య.
అందుకే దేవుడూ నేను అంటాడు,
జీవుడూ నేను అంటాడు.

469. ప్రశ్న : ముక్తునకు తాను ముక్తుడు అని నిర్ధారణ ఏమి?

సద్గురు : ఏ విషయంలోను
ఏ పరిస్థితుల్లోను
'ఘర్షణ' అనేది ఉండదు.

**470.** ప్రశ్న : దుర్వాసమహర్షికి ఛట్టున కోపం రావడమేమిటి? అతడు జ్ఞాని కదా!

సద్గురు : అంటే, ధర్మం విషయంలో అంత సుకుమారుడై ఉంటాడు.

ధర్మాచరణ విషయంలో ఎవరిలోగాని ఏ మాత్రం కొద్దిపాటి తేడా వచ్చినా ఆయన సహించలేడు. చిరాకు పడతాడు. దానిని సరిదిద్దేక్రమంలో కోపం, శాపం వెలువడతాయి వాని నుంచి.

మహర్షుల కోపం, శాపం అనేవి కూడా లోకానికి శ్రేయస్సును కూర్చేవే.

మహర్షుల శాపాల వల్ల అధోగతి చెందినవారు ఎవరూలేరు చరిత్రలో.

**471.** బాబు : గోదావరి పుష్కరాల్లో మునిగి తాను పవిత్రుడైనాక మళ్లీ కృష్ణానది పుష్కరాల్లో మునగాల్సిన అవసరం ఏముంది?

సద్గురు : మొదటిసారి పుష్కరస్నానం వలన తాను పవిత్రుడవుతాడు.

ఆ తరువాత తాను ఏ నదిపుష్కరాల్లో మునిగినా తన స్పర్శ వలన ఆ నది పవిత్రమవుతుంది.

**472.** భారతి : నేను ఎవరు?

సద్గురు : నేను అనేది సినిమా తెర.

భారతి అనేది తెరపై దృశ్యము.

నేనుతో మమేకం ఐతే సమస్య లేదు.

భారతితో మమేకం ఐతే సమస్య తెగదు.

* * *

నేను ఎవరు? అన్న ప్రశ్నకు

నేను అనేదే సమాధానం.

ఇక దానికి ఏ సమాధానమూ సెట్ కాదు.

* * *

భారతి : అలాంటప్పుడు భారతి ఉండకూడదు కదా?

సద్గురు : భారతి ఉంటే మాత్రం నీకేమి?

నీవు భారతిని చూసే సాక్షివి.

తెర మీద నీడ భారతి.

**473.** ప్రశ్న : ఒంటరితనానికి ఏకాంతానికి

తేడా ఏమి?

సద్గురు : అందరూ తనను వదిలేస్తే

అది ఒంటరి తనం.

తాను అందరినీ వదిలిస్తే

అది ఏకాంతం.

**474.** ప్రశ్న : ఉనికి అంటే ఏమి?

సద్గురు : ఉనికి అంటే "ఉండడం"

పూర్ణంగా ఉండం.

సూర్యుడు – సూర్యకాంతిలాగా

ఉనికి – పూర్ణం అనేది.

**475.** కృష్ణవేణి : చెడు కలలు వస్తున్నాయి. . .

నాపై ఎవరో చేతబడి చేశారని

అమ్మ చెబుతోంది...

మీరేమంటారు...?

బాబు : చేతబడులు అనేవి లేవు.

అలా ఉన్నాయని అన్నవారిని

సైక్రియాటిస్ట్‌కు చూపించండి...

మనస్సు బలహీనం వల్ల అన్నీ అలానే

కనిపిస్తుంది, కనిపిస్తుంది.

గోరంత కొండంతగా చూపి భయపెడుతుంది.

ఏ దృశ్యమైనా సరే మాయా స్వరూపమే.

దేవుడు కనబడ్డా సరే.

కాబట్టి దృశ్యానికి విలువివ్వొద్దు.

మానసికంగా దృఢంకా.

అంటే జ్ఞానం సంపాదించు.

అందుకు గురువును ఆశ్రయించు.

గొర్రెదాటులా ఉండొద్దు.

నీ బుర్రను ఉపయోగించు.

* * *

జీవితమే పెద్ద కల.

దాంట్లో మళ్లీ కల.

ఆ కల గురించి బుర్ర బద్దలు చేసుకోవడం వెర్రితనం.

పిచ్చికలలను గుఱించి ఇక తలపోయకండి.

జీవితాన్ని కలగా భావించండి.

ఈ సారం లేని సంసారంలో నటించండి.

అజ్ఞానుల మధ్య గంభీరంగా ఉండండి.

వారితో కలసి తాన తందాన పాడకండి.

మీరూ వాళ్ళలో చేరి అజ్ఞానుల సంఖ్యను పెంచకండి.

**476.** బాబు : సమస్యలేని జీవితముంటుందా?

సద్గురు : ఉండదు.

బాబు : కారణం?

సద్గురు : జీవితమే సమస్య కాబట్టి.

**477.** బాబు : ఈ సబ్జెక్టులో మనం ఒంటరివాళ్ళం అనిపిస్తుంది...
(మన సబ్జెక్టుకు ఎవడూ గుర్తించడం లేదని)

సద్గురు : "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అంటే ఇదే.
నీకంటే అన్యం ఏమీ లేదు.
నీవు గుర్తించడానికి
నిన్ను గుర్తించడానికి.

**478.** ఒకరు : 'నేను ఆత్మను' అనుకోమంటారా? లేక
'నేను దేవుణ్ణి' అనుకోమంటారా?

సద్గురు : "నేను" అని మాత్రం అనుకోండి చాలు.

**479.** పట్టెయ్య : "నేను" అనేదే భగవంతుని నామం, రూపం, అనుభవం, ఉనికి అంటున్నారు కదా...!

మరి అందరం నేను-నేను అంటూనే ఉన్నాం కదా? మరి అందరికీ భగవదానుభవం ఎందుకు కలుగడం లేదు?

సద్గురు : నేను అది, నేను ఇది అని నేను తర్వాత తోకలు తగిలిస్తున్నాం. ఆ తోకల వలన తాను జీవుడైనాడు. ఆ తోకలు లేకపోతే తానే దేవుడు.

**480.** ప్రశ్న : జీవన్ముక్తి అంటే?

సద్గురు : కలకంటూనే
కలలో ఉంటూనే

'ఇది కల' అని ఉంటే
అదే జీవన్ముక్తి.

481. ఒకరు : మాయను గురించి ఒక్క మాటలో చెప్పండి...

సద్గురు : కల

482. ఒకరు : గ్రంథాలు, ప్రవచనకర్తలు రాముణ్ణి ఆదర్శంగా చూపుతున్నాయి.

ఇది సరియేనా? దాని వల్ల ప్రయోజనం ఉందా?

సద్గురు : నాలుగు యుగాల్లోను రాముడు ఒక్కడే.
రాముణ్ణి ఆదర్శంగా తీసుకుని రాముడిగా మారిన వాళ్ళు ఎవరూ లేరు చరిత్రలో.
ఆదర్శం అనేది కల్లిబొల్లి మాటలే.
నీవు రాముడికి కావాలంటే ఒకటే మార్గం -
నీ తండ్రి దశరథుడై ఉండాలి.
నీ తల్లి కౌసల్య అయి ఉండాలి.
నీ గురువు వశిష్ఠుడై ఉండాలి.

483. సతీష్ : నాకు అశాంతిగా ఉందండి.
అది పోవాలంటే ఏం చేయాలి?

బాబు : అశాంతి ఉంటుంది.
అది చిరంజీవి.

నా అశాంతి

నాకు అశాంతి

అనుకోవడం పొరపాటు.

అజ్ఞానం ఉంటుంది.

నా అజ్ఞానం అనడంతప్పు.

దేహం ఉంటుంది.

నా దేహం అనడం దోషం.

ఎట్లా ఉన్నదానిని అట్లా చూడడమే దివ్యదృష్టి.

అది మంచిది, ఇది చెడ్డది.

అది ఉండాలి, ఇది ఉండకూడదు.

అని Judgment ఇవ్వొద్దు.

దాని వల్ల ఏం లాభం? అంటారేమో!

వాటిల్లో స్వభావాలు కనబడవు.

ఘర్షణ పోతుంది.

మనశ్శాంతి (స్వస్థితి) దొరుకుతుంది.

* * *

గరళం అనేదానిని నాశనం చేయలేం.

అమృతంలాగా అది చిరంజీవి.

అది ఎక్కడో ఒక చోట ఉండాలి.

ప్రపంచానికి ప్రమాదం లేకుండా

శివుడు తన కంఠలో నిలుపుకున్నాడు కరుణ చేత.

ఒక వస్తువును నాశనం చేయలేం.

రూపాంతరం చెందుతుంది అంతే.

కుండను నాశనం చేయగలమే గాని

మట్టిని నాశనం చేయగలమా?

ఒక వేళ చేసినా అది మరో రూపంలో "ఉంటుంది."

ఏదీ నాశనం అయ్యే మాటే లేదు.

నాశనం అంటే అస్సలు లేకుండా పోవడం కాదు,

నాశనం అంటే రూపాంతరం చెందటం.

హాలాహలాన్ని శివుడు నాశనం చేసి ఉండొచ్చు కదా?

శివుడికి కూడా వీలు కాదు.

అందుకే కంఠంలో దాచుకుని గరళకంఠుడైనాడు.

* * *

సారాంశం -

దేనికీ నాశనం లేదు.

అని తెలుసుకుంటే,

నీవు నాశరహితుడవే.

శాశ్వతుడవే.

శివుడవే.

* * *

నేను చెప్పదలచుకున్నదేమంటే -

మంచీ చెడులు

పాప పుణ్యాలు

సుఖదుఃఖాలు...

ద్వంద్వాలన్నీ "ఉంటాయి."

అవి చిరంజీవులు.

ద్వంద్వాలే లేకపోతే నాటకమే లేదు.

* * *

దుఃఖం పోవాలి అంటే

అది ఎక్కడకు పోవాలి?

ఎక్కడో ఒక చోటుకు పోవాలి.

ఎవరో ఒకరు భరించాలి.

అలాగే భరించాడు గరళాన్ని శివుడు.

బాబుకు "నేను" అనే స్ఫురణ ఎలా అయితే ఉంటుందో అలా ప్రతి వస్తువుకూ, ప్రతి విషయానికీ 'నేను' అనే స్ఫురణ ఉంటుంది.

విషయాలన్నీ వస్తువుల్లాగే చిరంజీవులు.

భావమే ఘనమై వస్తువవుతుంది.

వస్తువే సూక్ష్మమై భావమౌతుంది.

అన్నీ "ఉంటాయి"

"ఉండటం" లో సదా నీవు ఉండటమే పరమపదం.

484. ఒకరు : మనం ఊరికే ఉన్నా, రచ్చకు లాగుతున్నారు స్వామీ...!

సద్గురు : అవునవును ఇప్పుడు ఆ సమస్య ఎక్కడా ఉంది.

485. ప్రశ్న : ఆధ్యాత్మికంలో నియమనిష్ఠలు ఉండడం అవసరమా!

సద్గురు : గర్భంలో ఉన్న తల్లికి నియమ నిష్ఠలు ఉంటాయేగాని గర్భంలో ఉన్న శిశువుకు ఏ నియమ నిష్ఠలూ ఉండవు. మనం భగవంతుని గర్భంలో ఉన్నాం. మనకు ఏ నియమనిష్ఠలూ అవసరం లేదు. ఉంటే భగవంతునికి ఉంటాయి.

486. ఒకరు : అవతరించడం అంటే, దిగజారడం అన్నారు మీరు వివరించండి...

సద్గురు : ఆఫీసరుగా ఉన్న వ్యక్తి హఠాత్తుగా రోడ్లు ఊడ్చే పాకీవాడుగా మారిపోతే అది ఎదగడమా? జారడమా?

ఒకరు : జారడమే.

సద్గురు : దేవుని విషయంలో కూడా అంతే.
ఏకంగా ఉన్నవాడు ఏకంగా ఉండక
అనేకం అవ్వాలని ఎందుకు సంకల్పించినట్టు?
అది జారటం కాదా?

* * *

జీవులకు కర్మ ప్రేరణ కలిగించి
ధర్మాధర్మాలను కల్పించి
ధర్మాధర్మాలు బ్యాలెన్స్ తప్పినప్పుడు
ఏదో ఒక వేషంలో అవతరించి సరిచేయడం
ఇలా ఆలూమగలు (శివ-శక్తులు) యుగాల
పర్యంతం ఆడుకునే రంజకమైన ఆటే ఈ జగత్తు.

ఆటలో గీతలు గీసేదీ వాడే.
ఆట చివర్లో గీతలు చెరిపేదీ వాడే.

మనమంతా విధిలేక ఆడే బొమ్మలం.
విధికి (భగవదిచ్ఛకు) బానిసలం.

దేవుడు - దోషి.
జీవుడు - నిర్దోషి.

**487.** ఒకరు : టెక్నాలజీ నశిస్తే లోకం బాగుపడుతుంది.

సద్గురు : వీడు (మానవుడు) నశిస్తే అన్నీ బాగుంటాయి.

**488.** ప్రశ్న : ఈ కనబడే జగత్తు ఎట్లా వచ్చింది?
మన మనస్సే కారణమంటున్నారు...

సద్గురు : మనస్సే. కానీ మన మనస్సుకాదు.
మన మనస్సే అందుకు కారణమై ఉంటే

మనకు అనుకూలంగా, సుఖమయంగా
సృష్టించుకుని ఉంటాము కదా!

కాబట్టి సృష్టికి కారణం పరిమిత శక్తులు కలిగిన మన మనస్సు మాత్రం కాదు.

అనంతమైన శక్తే ఈ మనస్సుకు ఉండి ఉంటే అందరి మనస్సులోని భావాలను గ్రహించగలిగే శక్తి మనకు ఉండి ఉండాలి. అలా మనకు లేదు.

మరి ఏది కారణం ఈ జగత్తుకు? అదే మాయాశక్తి. ఉన్న ఒక్క 'సద్వస్తువు'ను (బ్రహ్మమును)

జీవజగత్తులుగా కన్పించేట్టుగా చేస్తోంది. కనుక బ్రహ్మము తనంతట తాను వేటితోనూ సంబంధం లేకుండా ఉంటూనే,

తనలోనే ఉన్న మాయా శక్తి వల్ల ఒకటి మరొకటిలా కన్పింపచేసే శక్తి కూడా వుందని అంగీకరించాలి. ఏకకాలంలో జీవజగత్తులతో సంబంధం ఉంది, లేదు.

సంబంధం ఉంది అంటే సగుణబ్రహ్మం. సంబంధం లేదు అంటే నిర్గుణ బ్రహ్మం.

మాయాశక్తితో కూడి సృష్టి చేసే బ్రహ్మము "మహామనస్సు"తో ఉంటాడు.

పరిమితశక్తులు కలిగి చిన్న చిన్న పనులు చేసే జీవుడు "చిన్నమనస్సు"తో ఉంటాడు.

అనంతమైన మనస్సే - మహామాయ.

పరిమితమైన మహామాయే - మనస్సు.

489. ప్రశ్న : అనుష్ఠాన వేదాంతం అంటే?

సద్గురు : వేదాంతం అనేది ఆచరణాత్మక విషయమా? వ్యవహారాలకు, భావాలకు అతీతమైన విషయాన్ని ఎలా ఆచరించడం?

'అనుష్ఠాన వేదాంతం' అను మాట వెర్రిమాట. వేదాంతాన్ని అనుష్ఠించలేం.

ధార్మిక విషయాలేవీ సత్యం వైపుకు తీసుకెళ్లవు.

ధర్మసూత్రాలు, నీతి సూత్రాలు ఏవీ ఆత్మను ఇవ్వవు. వేదాంతం అనేది ధర్మ, నీతి సూత్రాల సమాహారం కాదు.

నీకు నీవు ఎలా ఉండాలో చెబుతుంది ధర్మశాస్త్రం.

నీవు సంఘంలో ఎలా ఉండాలో చెబుతుంది నీతిశాస్త్రం.

నీవెలా ఉన్నావో చెబుతుంది వేదాంత శాస్త్రం.

ఆచరణ అంటేనే ప్రయోజనాన్ని ఆశించే ఉంటుంది.

పథ్యం వల్ల రోగికి ప్రయోజనం, వైద్యునికి కాదు. ధర్మం వల్ల వ్యక్తికి ప్రయోజనం.

లాభనష్టాలతో నిమిత్తం లేకుండా ఉంటుంది.

ఆధ్యాత్మికం.

ఉన్నదానిని ఉన్నరీతిగానే చూపెడుతుంది.

ఆధ్యాత్మికం.

ప్రపంచ విషయాలనే వివిధ రకాల వాద్య సమ్మేళనానికి ఆధారశ్రుతిగా ఉన్న మౌనమే ఆధ్యాత్మికం.

ధర్మాచరణ వలన బహుశా స్వర్గం దొరకొచ్చు.

ధర్మరాజే కాదు, కుక్క కూడా స్వర్గానికెళ్లింది.

అదేమీ గొప్పా కాదు, ఆదర్శమూ కాదు.

యముని ఇంటికెళ్ళి మృత్యు రహస్యాన్ని తెలుసుకున్న నచికేతుడు ఆదర్శనీయుడు.

మరణభయాన్ని జయించి ఆత్మ దర్శనాన్ని పొందిన రమణుడు ఆదర్శనీయుడు.

నేను చెప్పదలచుకున్నది -

ధర్మం అనేది లోక విషయం.
జ్ఞానం అనేది అలౌకిక విషయం.

ముందు జ్ఞానవంతుడివికా.
తర్వాత నీవు నడిచే దారి అంతా ధర్మమే అవుతుంది.

అంతేగాని ధర్మమార్గంలో నడవడం వలన జ్ఞానం దొరకదు అనేదే.

490. ప్రశ్న : ఎలా ఉండడం?

సద్గురు : అలా, ఇలా ఉండకుండా
కేవలం 'ఉండడం' గానే ఉండడం
గొప్ప సాధన, అదే సిద్ధి.

491. నాగేంద్ర : దేవాలయ నిర్వహణను నాకు అప్పగించారు...

సద్గురు : ప్రారబ్ధము పలురకాలు –
అందులో దేవాలయ నిర్వహణ ఒకటి.

492. ప్రశ్న : సృష్టి స్థితి లయకారకుడెవడు?

సద్గురు : నీవే.

మెలకువకు మునుపే సృష్టిని తయారుచేసుకుని మేలుకొంటావు.

ఆ సృష్టిలో నీవు భాగమై వ్యవహరిస్తావు.

నిద్రలో తిరిగి మొత్తపుసృష్టిని నీలోనే లయింప చేసుకొంటావు.

కాబట్టి
నీవు చూచే ప్రపంచానికి
నీవే సృష్టి స్థితి లయకారకుడివి.

**493.** ఒకరు : వేదాంత సారమేమి?

సద్గురు : కల కనేటప్పుడు
కలలో ఉన్నవాడుగా ఉండవద్దు.
కల కనేవాడుగా ఉండు.

అలాగే జగత్తులో ఉన్నవాడుగా ఉండక
జగత్తును కనేవాడుగా ఉండు.
సకల వేదాంత సారమింతే.

**494.** ప్రశ్న : ధర్మం అంటే ఏమి?

సద్గురు : 'ఇతరులు కూడా నేనే'
అని చేసే మంచి–చెడు కర్మలన్నీ ధర్మమే.

**495.** ప్రశ్న : మిథ్యా నేను, 'అసలు నేను'లో
కలిసి పోవాలంటే ఏం చేయాలి?

సద్గురు : ఎండమావి నీరు సముద్రంలో కలవాలంటే
ఏం చేయాలి? అని అడిగినట్లుంది.
ఒకదానికి అస్సలు ఉనికి లేదు.
మరొక దానికి తాను తప్ప మరొకటి లేదు.
అని తెలిస్తే అదే ఈ నేను ఆ నేనులో
కలిసి పోవడం అవుతుంది.

* * *

నిశ్చలమైన సముద్రంలో అంతర్వాహినిలా అపరిచ్ఛిన్నమైన 'నేను'లో మరో అంతవంతమైన నేను ఒకటి అంతర్వానిలా ప్రవహిస్తోంది. నిజానికి ఈ నేను (జీవుడు) ఆ నేను (దేవుడు) లో కలిసి పోవడం అంటూ ఏమీ లేదు. ఆ రెండూ సదా అభిన్నంగానే ఉన్నాయి. అని తెలుసుకుంటే అదే జీవబ్రహ్మైక్యయోగం.

**496.** ఒకరు : గీత హింసను ప్రేరేపించందని ఎవడో రష్యావాడన్నాడట....

సద్గురు : 'తనవాళ్లు' అనే మనో దౌర్బల్యం వలన కృష్ణుడికే నీతి సూత్రాలు వల్లించాడు అర్జునుడు. వొళ్లు మండింది కృష్ణుడికి.

ఇంట్లో హాయిగా నిద్రపోతున్న నన్ను
యుద్ధంలో సహాయం చేయమని అడిగావు.

తీరా రణరంగంలోకి వచ్చాక నీతి సూత్రాలను వల్లిస్తున్నావు. రణరంగంలోకి రాక మునుపు ఇవన్నీ గుర్తుకు రాలేదా?

ధర్మ రక్షణార్థమై యుద్ధం చేయడం అనేది నీ క్షత్రియ ధర్మం.

నీతి వదలి ధర్మాన్ని ఆచరించు.
దాని వలన పాపం రాదు.

నీవు చంపకపోయినా బ్రతికేవాళ్లు ఎవ్వరూ లేరు
ఇక్కడ అన్నాడు ఉక్రోషంగా కృష్ణుడు.

జీవహింస చేయడం పాపం అనడం నీతి.
కరిచేపామును చంపాలనడం ధర్మం.

కౌరవమూక కరిచే పాము.
అర్జునా! చంపు. అని గీతను ప్రబోధించాడు.

అంతేగాని రష్యావాడు అన్నట్టు
భగవద్గీత హింసను ప్రబోధించలేదు.
కర్తవ్యాన్ని (ధర్మాన్ని) బోధించింది.

**497.** ప్రశ్న : ఇంద్రజాలం అంటే ఏమి?

సద్గురు : ఇంద్రియ జాలమే ఇంద్రజాలం.
అది మూడు విధాలుగా చూపెట్టి
భ్రమపెడుతుంది –

1. ఉన్నదానిని లేనట్టుగా చూపెడుతుంది.
2. ఉన్నదానిని మరోవిధంగా ఉన్నట్టు చూపెడుతుంది.
3. లేనిదానిని ఉన్నట్టుగా చూపెడుతుంది.

**498.** సద్గురు : మనోవాక్కాయకర్మలు ఉన్నాయి అంటే, అదే గుర్తు నీకు దేవుని స్పర్శ లేదు అనటానికి...

దేవీప్రసాద్ : మనోవాక్కాయ కర్మలు లేకుంటే, నిత్యవ్యవహారం జరిగేదెట్లా?

సద్గురు : అద్దె ఇంట్లో ఉన్నట్టు ఉండు నువ్వీ దేహంలో. మనో వాక్కాయ కర్మలు ఉన్నా లేనివాడివే అవుతావు.

**499.** ప్రశ్న : సద్గురువు అంటే?

సద్గురు : సత్ అంటే "ఉన్నది."
గురువు అంటే "పెద్దది".

**500.** ప్రశ్న : వేదాంతసారాన్ని ఒక్కముక్కలో చెప్పండి...

సద్గురు : ఇది ఒక కల.

**గురుసన్నిధిలో ఉన్న శిష్యులకు 'గురువు' అనే Designation ఉండదు గానీ నిజానికి వారందరు కూడా గురువులే.**



– శ్రీమతి పావనీ
విశాఖపట్నం

- శ్రీరమణ-

బాబుగారూ!

గురుదేవుల వాసన(శక్తి)

మీకు బాగా అంటుకున్నది.

గురువచనాల మాదిరి

మీ వచనాలు కూడా బాగున్నాయి.

కొన్ని నవ్వు తెప్పిస్తున్నాయి!

* * *

లక్ష్మణుడు రామన్నకు అండగా నిలిచి

మాయావి అయిన ఇంద్రజిత్తును సంహరించినట్లు

మీరు గురుదేవుల అండన చేరి

ఉపదేశములనే అస్త్రాలతో

భక్తుల యొక్క జిత్తులమారి అయిన అహాన్ని

హరిస్తున్నారు.



- రత్నం

అరుణాచలం

# సద్గురు సన్నిధికి చేరు మార్గము

శ్రీకాళహస్తి రైల్వే స్టేషను (లేదా) బస్టాండు



చెన్నై రోడ్డు



సాయిబాబా గుడి దాటాక



భారత్ గ్యాస్ గోదాము ప్రక్క రోడ్డుకు చివర



L.I.C.కాలనీ, వాటర్ ట్యాంక్ క్రింద ఇల్లు



సుబ్రమణ్యం అయ్యావారు

ఫోన్: **9949491773**

# శ్రీ సద్గురు గ్రంథమాల

1. అనిలాచల శివమాల
2. జయశ్రీరమణ
3. జ్ఞానప్రసూనాలు
4. జ్ఞానాంబ దయామయి
5. మౌనభాషణం
6. సద్గురు దర్శనం
7. దేవీప్రసాదం
8. పరమపదం
9. ఇప్పుడు - ఇక్కడ - ఇలా
10. ఉపాసన
11. ఎవ్వనిచే...
12. సరాసరి.
13. భగవదిచ్ఛ
14. కనేదంతా కలవరింత - పలికేదంతా పలవరింత
15. సద్గురు హృదయం
16. కనుచూపు పారినంత మేరకు ఉన్నదే ప్రపంచం
17. నేనే ప్రశ్న - నేనే సమాధానం
18. పుట్టువారిలో మొదటివాడను - గిట్టువారిలో చివరి వాడను
19. బలమే దైవం
20. నేను 'మాత్రమే' ఉన్నాను.